## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000002799

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయ సూచిక

# ధర్మరక్షణ

## ఉపోద్ఘాతం

వేదశాఖలు పెరిగెనిచ్చట
ఆదికావ్యంబందుకొనెనిట
బాదరాయణ పరమఋషులకు
పాదు సుమ్మిది తమ్ముడా

సృష్టిలో జీవరాశి అవతరించి జీవ పరిణామం జరిగి మానవ జాతి అవతరించింది. ఆదిమానవుడు మొదట్లో సంచార జీవి. వర్షాలకు, ఎండలకు, క్రూరమృగాల నుంచీ రక్షణ కోసం కొండగుహల్లో తలదాల్చుకునేవాడే తప్ప ఎక్కడా ఒక స్థిర నివాసం ఏర్పరచుకోలేదు. నిప్పు చేయటం తెలిసే దాకా ప్రకృతిలో లభించిన ఫలాలను, కందమూలాలను, జంతువులను వేటాడి పచ్చి మాంసము తినేవాడు. తరువాత బుద్ధి వికాసం కలిగి వ్యవసాయం తెలుసుకుని దానికి అనుకూల వాతావరణం కోసం నదీనదాల ఒడ్డున స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. సంచారజీవం నుంచీ స్థిరనివాసానికి మారిన తర్వాతనే మానవుడు సంఘ జీవిగా మారాడు. క్రమేణా నాగరకతా వికాసం కలిగి యీ ప్రపంచంలో ఎన్నో జాతులు, దేశాలు, నాగరికతలు పుట్టుకొచ్చినవి. భారతీయ (సింధు), చైనా, ఈజిప్టు (నైలు) నాగరికతలు, గ్రీకు, రోము మహా సామ్రాజ్యాలు చరిత్రలో ప్రసిద్ధికెక్కినవి. కాని కాలక్రమేణా కొన్ని దేశాలు, నాగరికతలు కాలగర్భంలో కలిసిపోయినవి. ఒకనాడు మహోన్నత స్థితినందుకున్న సుమేరియన్, బాబిలోనియన్, గ్రీకు, రోమన్ నాగరికతలు యీనాడు లేవు. నాగరికతల పతనానికి కారణం ఆంతరంగిక దుర్బలత్వమేనని చరిత్ర ఉద్ఘాటిస్తున్నది. ఏ దేశమైనా, ఏ జాతియైనా, ఏ ధర్మమైనా దాని పటిష్టతను బట్టి, ప్రజల మనోభీష్టాన్ని బట్టి పది కాలాల పాటు నిలుస్తుంది. అది లేనినాడు నశిస్తుంది. ఇది చరిత్ర సత్యం. జీవ పరిణామ సిద్ధాంతం కూడా యిదే. జీవకోటిలో ఎన్నో జాతులు,

రకాలు ఉద్భవించినప్పటికీ జన్మించిన అన్ని జాతులూ యీనాడు లేవు. బలమైన జాతులు నిలుస్తాయి, బలహీనమైన జాతులు నశిస్తాయి. ఇది శాస్త్ర సత్యం.

ఎనిమిది వేల సంవత్సరాల నాగరికత కలిగిన హిందూ దేశం పవిత్ర నదులకు, పరమ ఋషులకు పుట్టినిల్లుగా, ధర్మమే ముఖ్య కేంద్రంగా వుండేది. ప్రజలు సాధు మనస్కులై, భక్తి కర్మ జ్ఞాన మార్గాలనన్వేషిస్తూ కాలం గడిపేవారు. ప్రపంచ నాగరికతలన్నీ కాలగర్భంలో కలిసిపోయినా, నేటికీ తన మౌలిక ధర్మంతో, సహజ సంస్కృతితో సజీవంగా నిలచి వున్నది హిందూ మతం. స్వామి వివేకానంద మాటల్లో చెప్పాలంటే ఇది మన పూర్వ జాతి వారసత్వం.

"ఏ ప్రాచీన భారత జాతి ప్రప్రథమంలో నాగరికతా శిఖరాలనందుకున్నదో, ఏ జాతిలో మానవ మేధ సంపూర్ణ వికాసం పొందిందో, ఆ జాతికి మేము వారసులం అని సగర్వంగా చెప్పగలవాళ్లు. మనస్సులోను హృదయంలోను ఆ జాతి లక్షణాలే గలవాళ్లు, యిప్పటికీ యీ గడ్డ మీద లక్షల కొద్దీ జన్మిస్తూనే వున్నారు. ఆ పూర్వ జాతి వారసత్వంలో ప్రపంచంలో ఎవరికీ లేని అధిక భాగం మనకే వున్నదేమో!"

- స్వామి వివేకానంద (ఉత్తిష్ఠద, జాగ్రద)

అయితే, గ్రీసు పుట్టకముందే, రోము పేరు వినపడక ముందే మన దేశంలో చైతన్యం వెల్లివిరిసిందని మనం మురిసిపోతే చాలా? మన తాతలు నేతులు త్రాగితే మనం మూతులు తుడుచుకుంటున్నామా? అంతటి మహోత్కృష్టమైన నాగరికత, జాతి సంకరం లేని హిందూ సమాజం యీనాడేవి? స్వచ్ఛమైన, మౌలికమైన హైందవ నాగరికత, సంస్కృతి యీనాడెక్కడా కనపడవేమి? మధ్య ప్రాచ్యదేశాలక్కూడా ప్రాకి మధ్యందినమార్తాండునిలా ప్రకాశించిన హిందూ మతం యీనాడు అస్తమించబోయే సూర్యునివలె కాంతివిహీనమై, ఉష్ణరహితమై, నిర్వీర్యమై, కళావిహీనమై ఉన్నదేమి? ప్రపంచ పటం నుంచీ హిందూ జాతి, హైందవ సంస్కృతి అస్తమించనున్నదా, ఈ దేశపటం, భౌగోళిక స్వరూపం భవిష్యత్తులో గతి తప్పనున్నదా అనే సందేహం కలుగుతోందే? ఎందుకిలా జరిగింది? ఎక్కడ లోపం కలిగింది?

నాగరికతలు అంతరించిపోవటానికి గల ప్రధాన కారణాలు అనేకం. ప్రకృతి వైపరీత్యాలు, అంతర్యుద్ధాలు, విదేశీ దురాక్రమణలు వంటివి. మొహంజదారో, హరప్పాలలో విలసిల్లిన సింధు నాగరికత అంతరించిపోటానికి సింధు నదీ వరదల వంటి ప్రకృతి వైపరీత్యాలే కారణమని చరిత్రకారుల అభిప్రాయం. ఆధునిక దేశాలైన సోవియట్ యూనియన్, యుగోస్లేవియా వంటి దేశాలు విచ్ఛిన్నమవటానికి కారణం అంతర్యుద్ధాలేనని

మనకు తెలుసు. ఇంక మన దేశం విషయానికి వస్తే గుప్త రాజుల పాలన వరకు స్వర్ణ యుగంగా వెలిగిన హైందవ చరిత్ర, సంస్కృతికి క్రీ.శ. 6వ శతాబ్దంలో, అరబ్బుల దండయాత్రతో పతనం మొదలైంది. అరబ్బులు, తురుష్కులు, మొగలులు, ఫ్రెంచి, డచ్చి, బ్రిటిషు వంటి విదేశీ దురాక్రమణలతో భారతదేశం 1947 ఆగస్టు నెల వరకు, ఆక్రమిత ప్రాంతమైంది. నిజానికి మన దేశంలోకి ప్రవేశించిన విదేశీ తెగల్లో ముస్లిములే మొదటి వారు కాదు. క్రీ.పూ. 2000వ సంవత్సరంలో మౌర్య సామ్రాజ్యపతనం తరువాత పార్థియన్లు, శకులు, కుషానులు మొదలగు విదేశీ తెగలు భారతదేశంలో ప్రవేశించి రాజ్య పాలన చేశారు. క్రీ॥శ॥ 500వ సంవత్సరంలో గుప్త రాజుల పతనానంతరం చైనా, మంగోలియా ప్రాంతపు సంచార జాతులైన హూణ జాతివారు మన దేశంపైకి దండెత్తి వచ్చి ఇక్కడే స్థిరపడ్డారు. నేటి మన రాజపుత్రులు హూణ సంతతి వారేనని చరిత్రకారుల అభిప్రాయం. భారత దేశంలో ప్రవేశించి ఇక్కడే స్థిరపడిన విదేశీ తెగల వారిలో ఒక్క ముస్లిములు తప్ప, మిగతా వారంతా స్థానిక జాతీయ స్రవంతిలో కలిసిపోయి హైందవ, జైన, బౌద్ధ మతాలను స్వీకరించి భారతీయులైనారు. దీనివల్ల మన జాతీయతకు, మతానికి, సంస్కృతికి రవ్వంత గూడా హాని జరగలేదు. కాని, క్రీ.శ. ఏడవ శతాబ్దంలో మన దేశంలోకి ప్రవేశించిన ముస్లిములు మాత్రం ఇస్లాం మత వ్యాప్తితో స్థానిక మతాలను, సంస్కృతిని కాలరాచి, ప్రతిఘటించిన హిందువులనెందర్నో వధించి, దేవాలయాల్ని నేలకూల్చి, హిందూ స్త్రీల మానప్రాణాల్ని హరించివేసిన రక్కసి మూకలు. వీరి వల్లనే భారతదేశం రక్తసిక్తమై భరతఖండం రెండుగా చీలింది.

భారత దేశ చరిత్రను అతలాకుతలం చేసి, హిందూ సంస్కృతిని, మతాన్ని మంటగలిపి, మనలను వేయి సంవత్సరాల బానిస జీవితానికి గురి చేసిన యీ ముస్లింలు అసలు ఎవరు? ఎక్కడ నుంచి వచ్చారు? అధికారాన్ని హస్తగతం చేసుకుని మనల్ని వేయి సంవత్సరాలు ప్రతిఘటన లేకుండా ఎలా పాలించగలిగారు?

# ఇస్లాం పుట్టుక

క్రీ.శ. ఆరవ శతాబ్దంలో పశ్చిమాసియాలోని ఎడారి ప్రాంతమైన అరేబియా దేశంలో మహమ్మదు ప్రవక్త ఇస్లాం మతాన్ని బోధించాడు. ఈ మతానికి మూల సూత్రం "లా ఇల్లా హీ ఇల్లల్లా మహమ్మద్ ఉర్‌రసులల్లా" అంటే అల్లా తప్ప వేరేదేముడు లేడని అర్థం. ఫలితంగా అరబ్బులు విపరీతమైన మతావేశంతో ఇస్లాం వ్యాప్తికి పూనుకున్నారు. ఆసియా, ఆఫ్రికా ఖండంలో నేడు చాలా వరకు ఇస్లాం వ్యాపించింది. ఇస్లాం అంటే

శరణం, శాంతి పొందటం అని అర్థం. మక్కాలోని ఒక నల్ల రాతికి 'కాబా' అని పేరు. ఇది ఆకాశం నుంచీ ఊడిపడిందనే నమ్మకంతో మక్కా ప్రజలు దీని చుట్టూ ఒక దేవాలయం కట్టి దానిలో విగ్రహాలు నెలకొల్పి, రోజూకొక్క విగ్రహం చొప్పున పూజించేవారు. ప్రవక్త మహమ్మదుకు తన ఆరవ ఏటనే తల్లిదండ్రులు మరణించడంతో కొన్నాళ్లు పశువుల కాపరిగాను, మరి కొన్నాళ్లు ఒంటెల బిడారంలోను పని చేసేవాడు. ఇరవై నాలుగు సంవత్సరాల వయసులో మహమ్మదు ఖదీజా అనే నలభై సంవత్సరాల వితంతు స్త్రీని వివాహం చేసుకుంటాడు. తరువాత మహమ్మదుకు ఒక దేవదూత సాక్షాత్కరించి ఒక బంగారు పలకను చూపి అందులో వ్రాసి వున్న దానిని చదవమంటుంది. అంతవరకు చదువు రాని మహమ్మదు ఆ బంగారు పలకను చదవగలుగుతాడు. తరువాత దేవదూత మరెన్నో పలకలను మహమ్మదుతో చదివిస్తుంది. వాటిని మహమ్మదు తరువాత తన అనుచరులకు వినిపించగా అదే పవిత్ర కొరాన్ (పఠనం) అయింది. విగ్రహారాధనను వ్యతిరేకించిన ప్రవక్త మహమ్మదు వల్ల మక్కా దేవాలయం ఆదాయం తగ్గిపోతోందని భావించిన మక్కా నగర ప్రజలు మహమ్మదును చంపడానికి ప్రయత్నిస్తుండటంతో ఆయన మక్కా వదలి మదీనాకు పారిపోయాడు. తిరిగి క్రీ.శ. 628లో 1400 మంది అనుచరులతో మక్కా వచ్చి కాబా దేవాలయంలోని విగ్రహాలన్నిటినీ పగులగొడతాడు. తన మొదటి భార్య ఖదీజా మరణానంతరం తన మిత్రుడు, ప్రియశిష్యుడైన అబూ బేకర్ కుమార్తె ఆయేషాను వివాహం చేసుకుంటాడు. మక్కాను జయించి స్థిరపడిన మహమ్మదు ప్రవక్త చివరకు అక్కడే మరణిస్తాడు.

మహమ్మదు ప్రవక్త మరణానంతరం అతని వారసుని (ఖలీఫా) గురించి తగాదా వచ్చి, మహమ్మదీయులు షియా, సున్నీ శాఖలుగా విడిపోతారు. మహమ్మదు ప్రవక్త వంశీయులే ఖలీఫాలుగా నుండాలనేది షియాల వాదమైతే అర్హత గలగిన వారెవరైనా ఖలీఫాలుగా నుండవచ్చునని సున్నీల వాదం.

# హిందూ దేశంలోకి ఇస్లాం ప్రవేశం

భారతదేశంలోని పశ్చిమ ప్రాంతమైన సింధు రాజ్యాన్ని దాహెర్ అనే హిందూ రాజు పరిపాలిస్తుండేవాడు. అప్పటికే ఇస్లాం వ్యాప్తికై అరబ్బులు బొంబాయి, దేబాల్ పట్టణాలపై దాడులు జరిపినా దాహెర్ వాటిని త్రిప్పికొట్టాడు. కాని క్రీ.శ. 708లో మహమ్మదు బిన్‌కాశిం నాయకత్వంలో దాడి జరగగా సింధు రాజధాని అరబ్బుల వశమై

మొట్టమొదటిసారిగా భారతగడ్డపై ఇస్లాం తన ఉక్కు పాదాన్ని మోపింది. అంతఃకలహాల కారణంగా స్థానిక రాజోద్యోగులు విదేశసన్నుడు, వ్లేచ్ఛుడు అయిన కాశింకు సాయపడినందువల్లనే సింధు రాజధాని అరబ్బుల వశమై, రాజద్రోహానికి, మతద్రోహానికి ఆనాడే నాందీప్రస్తావన జరిగింది! నాటి నుండి నేటి వరకు హిందువులు అంతః కలహాలలో మునిగి ముస్లింలకు వత్తాసు పలుకుతూనే వున్నారు. మన నాయకులు, ప్రజలు ముస్లింలకు భట్రాజులై తమ మతానికి తామే హాని తలపెట్టుకుంటున్నారు.

అరబ్బుల తరువాత మన దేశం పై దండెత్తి వచ్చిన వారు తురుష్కులు. వీరు ఆఫ్ఘనిస్తాన్‌లోని అతి క్రూర స్వభావులు. గజనీ రాజ్యాన్ని పరిపాలిస్తున్న మామూదు, గజనీ మహమ్మదుగా ప్రసిద్ధికెక్కి ప్రతి సంవత్సరమూ భారతదేశం పైకి దండెత్తి వచ్చి అచటి విగ్రహారాధనను నిర్మూలిస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. పన్నెండు సార్లు మన దేశం పై జరిపిన దండయాత్రల్లో కఠియావార్‌లోని సోమనాథ్ దేవాలయం పై జరిగిన దాడి చాలా పెద్దది. చాలా ఐశ్వర్యవంతమైన యీ దేవాలయ సంపదను దోచుకోవడమే గాక పవిత్రమైన లింగాన్ని కూడా గజనీ మహమ్మదు బ్రద్దలు కొట్టి దేవాలయాన్ని అపవిత్రం చేశాడు. ఆఫ్ఘనిస్తాన్‌లోని మరొక రాజ్యమైన ఘోరీ పాలకుడు మహమ్మదు ఘోరీ, భారతదేశంలో ఇస్లాం వ్యాప్తికై ఇచట స్వతంత్ర ముస్లిం రాజ్యాన్ని స్థాపించాలనే కోరికతో వచ్చి ఢిల్లీ, అజ్మీరులను జయించాడు. ఇతడు తిరిగి తన స్వదేశమైన ఆఫ్ఘనిస్తాన్‌కు వెడుతూ భారతదేశంలో తాను జయించిన రాజ్యాలకు తన ప్రతినిధిగా కుతుబుద్దీన్ ఐబక్ అనే సేనానిని నియమించాడు. ఘోరీ మరణానంతరం కుతుబుద్దీన్ స్వతంత్రుడై భారతదేశంలో ప్రప్రథమ ముస్లిం స్వతంత్ర రాజ్యస్థాపకుడైనాడు. దీనికి చిహ్నంగానే ఢిల్లీ నగరంలో కుతుబ్‌మినార్‌ను నిర్మించాడు.

ఉత్తర భారతదేశంలో తురుష్క సామ్రాజ్యం బలపడుతున్న సమయంలో దక్షిణ భారతదేశంలో చాళుక్య, చోళ వంశాల మధ్య ఒక శతాబ్దం పాటు భయంకర సంఘర్షణలు జరిగి ఉభయులూ నశించారు. వీరి సామ్రాజ్య శిథిలాల నుంచీ నాలుగు స్వతంత్ర రాజ్యాలు ఏర్పడినవి. అవి యాదవ (మహారాష్ట్ర), హోయసాల (కర్నాటక), పాండ్య (తమిళ) మరియు కాకతీయ (ఆంధ్ర). అయితే వీరంతా ఉత్తర భారతదేశంలోని రాజకీయ పరిణామాలను ఒక ప్రమాద సూచికగా గుర్తించక తమలో తాము కలహించుకుంటూండటంతో క్రీ.శ. 1306లో అప్పటి ఢిల్లీ సుల్తానైన అల్లాఉద్దీన్ ఖిల్జీ వీటిని జయించాడు. దీనితో యావద్భారత దేశం ముస్లింల హస్తగతమైంది.

# తెలంగాణాలో ముస్లిం పాలన

మహమ్మద్ బిన్ తుగ్లక్ కోసం శిస్తు వసూలు చేసే ఉద్యోగులు జరిపిన తిరుగుబాటు ఫలితంగా బహమనీ రాజ్యస్థాపన జరిగింది. అయితే తరువాత ఇవి అయిదు స్వతంత్ర ముస్లిం రాజ్యాలుగా బీరార్ (ఇమామ్‌షాహిలు), బిజాపూరు (ఆదిల్‌షాహిలు), అహమ్మదునగరు (నైజాంషాహిలు), బీదర్ (బరీద్ షాహిలు) మరియు గోల్కొండ (కుతుబ్‌షాహిలు)గా విడిపోయారు. గోల్కొండ రాజైన కులీకుతుబ్‌షాయి క్రీ.శ. 1598లో రాజధానిని గోల్కొండ నుంచి హైదరాబాదుకు తరలించాడు. ఇతడే క్రీ.శ. 1593లో చరిత్రాత్మకమైన చార్మినార్‌ను నిర్మించాడు. కుతుబ్‌షాహిలలో చివరి వాడైన అబుల్ హసన్ తానాషా ఔరంగజేబుకు బందీగా చిక్కడంతో గోల్కొండ రాజ్యం మొగలాయి సామ్రాజ్యంలో విలీనమైంది. కుతుబ్‌షాహిల పాలనను అంతమొందించిన ఔరంగజేబు తెలుగు ప్రాంతాలన్నిటితో బాటుగా మహారాష్ట్ర, కర్నాటకలోని కొన్ని ప్రాంతాలను గూడా చేర్చి వీటి పాలనకై సుబేదారుగా నిజాము ముల్క్‌ను నియమించాడు. ఔరంగజేబు మరణానంతరం ఇతడు స్వతంత్రుడై నైజాంకు పాలకుడైనాడు. తరువాత తెలంగాణా ప్రాంతం అసఫ్‌జాహిల పాలనకు వచ్చి 1948 సెప్టెంబరులో పోలీసు చర్యతో భారత్‌లో విలీనమైంది.

# హిందూ ప్రతిఘటన

అన్యమతస్తులు, దురాక్రమణాదారులునైన ముస్లిం పాలకులు అనేక హిందూ దేవాలయాల్ని దోచుకుని ధ్వంసం చేశారు. ముస్లిం రాజ్యంలో ముస్లిమేతరులపై విధించే జిజియా వంటి పన్నులతో హిందువులను బాధించేవారు. హిందువులు వాహనములు ఎక్కరాదు. విలాస వస్తువులు వాడరాదు. పంటలో సగ భాగం పన్నులకే పోయేది. బాబరు చక్రవర్తి హిందువులను కాఫిర్‌లని చులకనగా సంబోధించేవాడు. ఇతడు రాణా సంగాపై జిహాద్ ప్రకటించి ఘజీ అనే బిరుదును పొందాడు. పెర్షా కూడా హిందూ వ్యతిరేకి. జోధ్‌పూరులోని హిందూ దేవాలయాల్ని పడకొట్టి వాటి స్థానంలో మసీదులు కట్టించాడు. ఇంక ఔరంగజేబు సంగతి చెప్పనక్కర్లేదు. ఈ ముస్లిం పాలకుల హైందవ వ్యతిరేక విధానాలకు నిరసించిన హిందువులు స్వమత రక్షణకు నడుం కట్టారు. అట్టి వారిలో ముఖ్యులు కాకతీయులు, విజయనగర రాజులు, మహారాష్ట్రులు.

చాళుక్య రాజులకు సామంతులైన కాకతీయులు రాష్ట్ర కూట వంశానికి

చెందినవారు. చాళుక్య పతనానంతరం వీరు స్వతంత్రులై ఓరుగల్లు రాజ్యాన్ని పాలించారు. క్రీ.శ. 1199లో గణపతి దేవుడు రాజధానిని హనుమకొండ నుంచి ఓరుగల్లుకు తరలించాడు. తెలంగాణాలో మునుసూరి ప్రోలయ నాయకుడు రేచర్ల సింగమనాయకుడు వంటి వారితో కలసి భద్రాచలం అడవుల్లోని రేకపల్లి కేంద్రంగా ముస్లింలతో పోరాటం సాగించారు. రాయలసీమలో అరవీటి సోమదేవరాజు విజృంభించి మాలిక్ అహ్మదు నోడించి అనేక దుర్గాలనాక్రమించాడు. కాపయ నాయకుడు విజృంభించి క్రీ.శ. 1336లో ఓరుగల్లును ముస్లింల నుండి తిరిగి ఆక్రమించుకున్నాడు. అయితే క్రీ.శ. 1358లో జఫార్‌ఖాన్ అనే సుల్తాను ఓరుగల్లు పై దాడి చేయగా కాపయ నాయకుడు సుల్తానుకు గోల్కొండనిచ్చి సంధి చేసుకున్నాడు.

హరిహరబుక్కరాయ సోదరులిరువురూ ఓరుగల్లులోని ప్రతాపరుద్రుని ఆస్థానోద్యోగులు. ఓరుగల్లు ఢిల్లీ సుల్తానుల వశం కాగానే వీరిరువురూ తుంగభద్రా నదీ తీరమైన ఆనెగొంది అనే గ్రామానికి వలసపోయారు. అక్కడ వీరికి విద్యారణ్యస్వామి పరిచయ భాగ్యం కలిగి రెండు శతాబ్దాల విజయనగర సామ్రాజ్యానికి శ్రీకారం చుట్టబడుతుంది. దక్షిణ దేశంలో సుల్తానుల దుష్ట పాలనను అంతమొందించాలని సంకల్పించిన విద్యారణ్యస్వామి శృంగేరీ మరియు కంచి పీఠాధిపతుల ఆశీస్సులతో క్రీ.శ. 1336లో విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించి హరిహర బుక్కరాయలను పట్టాభిషిక్తులను గావించి రెండు శతాబ్దాల పాలనలో హైందవ ధర్మం, సంస్కృతి పరిరక్షణకు కృషి చేశాడు.

ఢిల్లీ సుల్తానుల కాలంలో దక్షిణ దేశంలో సంగమ వంశ రాజుల నాయకత్వంలో హైందవ ధర్మ రక్షణ కోసం విజయనగర సామ్రాజ్యం అవతరించిన విధంగానే మొగలాయిల కాలంలో భాన్‌స్లే వంశస్థుల నాయకత్వంలో మహారాష్ట్ర రాజ్యస్థాపన జరిగింది. క్రీ.శ. 1565లో రాకాసి తంగడి యుద్ధంలో విజయనగరం వారు పరాజయం పాలైన తర్వాత హైందవ ధర్మరక్షణ విషయంలో పెద్ద కొరత ఏర్పడింది. ఔరంగజేబు, కడపటి మొగలులు అవలంబించిన హిందూ వ్యతిరేకపాలన మహారాష్ట్రులలో స్వధర్మ రక్షణ భావాలను చైతన్యవంతం చేసినాయి. తుకారామ్, రామదాస్, వామదేవ్ వంటి వారి బోధనలతో మహారాష్ట్రులు ప్రభావితులై హైందవ ధర్మాన్ని నిలబెట్టవలెనని సంకల్పించారు. అహమ్మద్ నగరం పతనానంతరం సాంస్కృతిక పునరుజ్జీవనంతో ఉత్తేజితులైన మహారాష్ట్రులకు ఆ తరుణంలో శివాజీ జన్మించడం చాలా గొప్ప సంఘటన. ప్రజలలో చెలరేగుతున్న హిందూ మత భావాలను అర్థం చేసుకుని వారిని మహమ్మదీయ దాస్యశృంఖలాల నుండి విముక్తులను చేసి స్వేచ్ఛా జీవులను చేయడానికి శివాజీ ఉద్యుక్తుడైనాడు. తల్లి

జిజియాబాయి, దాదాజీ కొండదేవ్, సమర్థ రామదాస్ వీరి ముగ్గురి వలన ప్రభావితుడైన శివాజీ క్రీ.శ. 1644లో తన అనుచరులతో సహా రైలికొండలలోనున్న రాయిరేశ్వర్ దేవాలయంలో హైందవ ధర్మ రక్షణ కోసం తన శాయశక్తులా కృషి చేస్తానని ప్రమాణ స్వీకారం చేస్తాడు. ఉత్తరాన రామనగర్ నుంచి దక్షిణాన కార్వార్ వరకు, తూర్పున నాసిక్ నుంచి పడమర కర్నాటక తంజావూరు వరకు ఇతని రాజ్యంలో భాగమైనాయి. దాదాపు రెండు శతాబ్దాల పాలనలో ముస్లిం పాలకులను ముప్పతిప్పలు పెట్టిన వీరోచిత నాయకుడుగా ఛత్రపతి శివాజీ చరిత్రలో సుప్రసిద్ధుడు.

# ఆంగ్లేయుల వలస పాలన

**భా**రత దేశంలో ముస్లిం పాలనను అంతమొందించాలని ప్రయత్నించిన హిందూ రాజుల ప్రయత్నాలు పూర్తి ఫలితాలను ఇవ్వలేదు. ఏదో కొద్దికాలం, కొన్ని ప్రాంతాలను మాత్రమే వారు మహమ్మదీయ పాలన నుండి విముక్తి గావించగలిగారే తప్ప శాశ్వతంగా భారతదేశంలో ముస్లిం పాలననంతమొందించలేకపోయిన హిందువులు నైరాశ్యంతో ఇంక తమకు స్వాతంత్ర్య సూర్యోదయం దుర్లభమేమోనని విచారిస్తున్న తరుణంలో పశ్చిమ దేశాల్లో వలస రాజ్యస్థాపనకై ప్రయత్నాలు జరుగుతుండేవి. ఇంగ్లీషు, ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు వగైరా దేశాల వారు వలస రాజ్యస్థాపనకై ఇక్కడికి వచ్చి వారిలో వారు పోటీలు పడుతూ యుద్ధాలు గూడా చేసుకునేవారు. చివరకు యీ పోటీలో ఇంగ్లీషు వారే నెగ్గి భారతదేశం యావత్తు తమ ఆధీనంలోకి తెచ్చుకున్నారు. భారతదేశంలోని చిట్ట చివరి మొగలు చక్రవర్తి బహదూర్ షాజఫర్‌ను బ్రిటిషువారు బందీగా పట్టుకోవడంతో హిందూ దేశంలో వేయి సంవత్సరాల ముస్లిం పరిపాలనకు శాశ్వతంగా తెరపడింది.

బ్రిటిషు వారి పాలనలో భారతీయులకు ప్రపంచ దేశాలతో సంబంధం ఏర్పడింది. పాశ్చాత్య విద్యావాసనలతో భారతీయుల్లో స్వాతంత్ర భావాలు మొలకెత్తినవి. ఆధునిక సాంకేతిక విద్య, విజ్ఞానంతో భారతీయులు విద్యాధికులై తమ మాతృభూమి విముక్తికై ఉద్యమం చేపట్టారు. 1857లో సిపాయిల తిరుగుబాటుతో ప్రారంభమైన యీ ఉద్యమం 1947లో గాంధీ మహాత్ముడి అహింసా యుద్ధంతో ముగిసింది. భారతీయుల ఐక్యసమరశంఖారావానికి బ్రిటిషు సామ్రాజ్యం తల వంచక తప్పలేదు. భారతీయుల మనోభావాలను అర్థం చేసుకున్న బ్రిటిషు ప్రభుత్వం 1947 ఆగస్టు 15న తమ వలస పాలనకు స్వస్తి చెప్పింది. హిందువులు స్వతంత్రులైనారు. హిందువుల భావదాస్యానికి ప్రాయశ్చిత్తంగా భరతఖండం రెండుగా చీలింది.

# దేశానికి స్వాతంత్ర్యం వచ్చినా తెలంగాణాకు మాత్రం రాలేదు!

భారత దేశం ఆంగ్లేయుల పాలన కిందున్నపుడు దేశంలో ఎన్నో సంస్థానాలుండేవి. వీటికి ఒక్క విదేశీ వ్యవహారాలు, భద్రత, ప్రయాణ సౌకర్యాలు తప్ప తక్కిన విషయాల్లో తమకు కావలసిన విధంగా ప్రవర్తించే స్వేచ్ఛ వుండేది. 1947 జులై నెలలో సర్దార్ వల్లభాయి పటేలు సంస్థానాధీశులందర్నీ ఉద్దేశిస్తూ స్వాతంత్ర్య వచ్చిన తరువాత గూడా యీ మూడు విషయాలను భారత ప్రభుత్వానికి అప్పగించి తదితర విషయాల్లో పూర్వం వలెనే వుండవచ్చనీ, వారి స్వేచ్ఛకెటువంటి అవరోధము వుండబోదని చెప్పాడు. 1947 ఆగష్టు 15 నాటికి ఒక్క కాశ్మీరు, హైద్రాబాదు, జునాగఢ్‌లు తప్ప తక్కిన సంస్థానాలన్నీ భారత్‌లో విలీనమైనాయి. తరువాత జునాగఢ్ గూడా విలీనమైనప్పటికీ కాశ్మీర్ మాత్రం యీనాటికీ ఆరని నిప్పుల కుంపటిలాగా తయారైంది. ఇంక మన హైదరాబాదు విషయానికి వస్తే, నైజాం నవాబుకి సర్దార్ పటేలు పెట్టిన షరతులేమాత్రం నచ్చలేదు. అతనిక్కావలసింది స్వతంత్రంగానుండటమో లేక పాకిస్తాన్లో, కలవటమో తప్ప భారత్‌తో సంబంధాలు ఇష్టం లేదు. కానీ చేసేది లేక ఒక్క సంవత్సరం పాటు భారతదేశంతో ఒడంబడిక చేసుకున్నాడు. దీని ప్రకారం నైజాం ప్రతినిధి ఒకరు ఢిల్లీలో వుండేటట్లు, భారత యూనియన్ ప్రతినిధి ఒకరు హైద్రాబాద్‌లో వుండేటట్లు ఒప్పందమైంది. కానీ నైజాం నవాబు బ్రిటిషు వారు వైదొలగంగానే సంస్థానాధీశులంతా తిరిగి స్వతంత్రులైనారని ఒక కొత్త సిద్ధాంతం లేవదీశాడు. మజ్లిస్ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ అనే పార్టీ స్థాపకుడైన బహదూర్ యార్ జంగ్‌తో చేతులు కలిపాడు. అసఫ్‌జాహీల పతాకం ఎర్రకోట పై ఎగురుతుంది అన్న ఖాసిం రజ్వీ ప్రకటనలను నైజాం మౌనంగా సమర్థించేవాడు. జిన్నా తనకేదైనా సహాయం చేస్తాడేమోనని పాకిస్తాన్‌కు 25 కోట్ల రూపాయలు అప్పుగా ఇచ్చాడు కూడా. భారత్‌తో తలపడవలసి వస్తుందేమోనని నైజాం తన సైన్యాన్ని అప్రమత్తం చేయసాగాడు. ఇంక ఉపేక్షించి లాభం లేదని, నైజాం వల్ల దేశభద్రతకు ముప్పు వాటిల్లగలదని భావించిన పటేలు 1948 సెప్టెంబరు 13వ తేదీన భారత సైన్యాన్ని నైజాంలోకి పంపాడు. ఖాసిం రజ్వీ పారిపోగా, రజాకార్లు, నైజాం సైన్యం భారత సైన్యం ముందు తోకముడిచాయి. చివరకు 1948 సెప్టెంబరు 17వ తేదీన హైద్రాబాదు భారత యూనియన్లో విలీనమై, ఏడు శతాబ్దాల ముస్లిం పాలనకు తెరపడింది. హిందువులు పూర్తి స్వతంత్రులైనారు.

# సింహావలోకనం

ఇదీ క్లుప్తంగా మన గత చరిత్ర. చరిత్ర కేవలం సంఘటనలను వివరిస్తుందే తప్ప కారణాలను విశ్లేషించదు. చరిత్రను చదువుకుని, కారణాలను విశ్లేషించుకుని చరిత్రలోని చేదు వాస్తవాలను పునరావృతం కాకుండా చూసుకోవాలి ఎవరైనా. భారతదేశాన్ని జయించి పాలించిన ముస్లిములకు స్థాన బలం లేదు. సంఖ్యా బలం లేదు. బాహుబలం, యుద్ధతంత్రంలో హిందూ రాజుల కంటె ఆధిక్యత లేదు. కానీ వారు భారతదేశాన్ని ఆక్రమించుకుని ప్రతిఘటన లేకుండా ఇన్ని సంవత్సరాలు ఎలా పరిపాలించగలిగారు? దీనికి సమాధానం ఒక్కటే. ముస్లిములకి వారి మతమే వారికి స్ఫూర్తి, శక్తి. దానికి తోడు హిందువుల అనైక్యత, రాజద్రోహం, మతద్రోహం కలసి వచ్చినాయి. తమ మతవ్యాప్తి కోసం, మతాంతరీకరణ కోసం ముస్లిములు ఎంతటి ఆవేశాన్నైనా తెచ్చుకోగలరు. ఎంతటి త్యాగాన్నైనా సరే చేయగలరు. జిహాద్ పేరుతో ప్రత్యర్థుల్ని కనికరం లేకుండా వధించగలరు. ఇది ముస్లిములకు ఇస్లాం మతం యిచ్చిన దివ్యౌషధం. ఈ కారణంగానే అతి స్వల్ప వ్యవధిలోనే ప్రపంచ దేశాల్లో మూడవ వంతు ఇస్లాం వ్యాపించగలిగింది. ఇస్లాంకున్న మతావేశం హిందూ మతానికి లేకపోవడంతో హిందువులు ముస్లిముల చేతిలో దురాక్రమణకు గురికాబడ్డారు. హిందువులకు మతం వేరు, రాజకీయం వేరు. వీరెప్పుడూ ధర్మ పరిపాలనను గావించారే తప్ప మత పరిపాలనను, మత వ్యాప్తి కోసం యుద్ధాలనెన్నడూ చేయలేదు. కానీ అన్య మతాలు దీనికి విరుద్ధం. వారికి మతం, రాజకీయం రెండూ ఒక్కటే. మతం విస్తరిస్తే రాజ్యం విస్తరిస్తుంది. రాజ్యం విస్తరిస్తే మతానికి రక్షణనిస్తుంది. అందుకే రాజకీయ యుద్ధాలు మత యుద్ధాలుగా మారి మతావేశం లేని హిందువుల పై విజయానికి తోడ్పడినాయి.

భారతదేశం ఏడవ శతాబ్దంలో అరబ్బుల దురాక్రమణకు గురికాబడి క్రమేపి దేశం అన్యాక్రాంతం కావడం, తురుష్కులు, మొగలులు హిందూ ధర్మాన్ని అణగద్రొక్కి మన సంస్కృతిని నాశనం చేయడం కేవలం ఒక దురదృష్టకర పరిణామం అనుకుందాం. అప్పుడు దేశమంతా ఒకటిగా లేదు గనుక హిందువుల్లో ఐక్యత కరువైందనుకుందాం. కానీ నేడు దేశం స్వతంత్రం అయిన తరువాత గూడా హిందువుల్లో చైతన్యం రాలేదు. నాడు దేశ విభజనను నివారించడం కోసం ముస్లిములను బుజ్జగించారనుకుందాం. కానీ యీనాటికీ అదే ధోరణి కొనసాగిస్తూ ముస్లిములకు ప్రత్యేక చట్టాలు, ప్రత్యేక హక్కులను కల్పిస్తూ చేసిన తప్పునే మళ్లీ మళ్లీ చేస్తున్నారు. చరిత్ర నేర్పిన పాఠాలను నేర్చుకుని,

పోగొట్టుకున్న గత వైభవాన్ని, భంగపడిన మన సంస్కృతిని పునరుద్ధరించుకోవలసింది పోయి తాము కూర్చున్న చెట్టు కొమ్మను తామే నరుక్కునే కాళిదాసు సంతతి వారనిపించుకుంటున్నారు హిందువులు. నేడు హిందువులు సంఖ్యాపరంగా అధికులు. అధికారంలో నున్నవారు. ఐకమత్యం లోపించటం వల్ల ఇన్నేళ్లుగా తాము కోల్పోయినదేమిటో తెలుసుకోగలిగిన జ్ఞానవృద్ధులు. అయినా గాని వీరిలో ఇంకా వదలని అవలక్షణం అతి మంచితనం. నాటి దేశ విభజనకు గాని, నేడు దేశంలో నెలకొని వున్న తీవ్రవాదానిక్కాని అతిమంచితనమే కారణం. ఈనాడు హిందువులకు బాహ్య శత్రువులు లేరు. హిందువులంతా కలసి కోరుకుంటే సాధించలేనిదేమీ లేదు. కానీ హిందూ మత పునర్ధుధరణకు హిందువులంతా కలసిరారు. హేతువాదం, నాస్తిక వాదం, పిడివాదం వంటి వాటితో హిందూ మత విశ్వాసాలను అవహేళన చేస్తూ, స్వార్ధ రాజకీయ ప్రయోజనాల కోసం మైనారిటీలను బుజ్జగిస్తూ, హిందువుల్ని సామూహిక మతాంతరీకరణ చేయడమే ఆశయంగా పెట్టుకున్న క్రైస్తవ మిషనరీలకు మరింత స్వేచ్ఛనిస్తూ, హిందువుల ఉన్నతికి హిందువులే పెద్ద అవరోధంగా తయారైనారు.

మనందరకూ మహాభారత కథ బాగా తెలుసు. అందులో రాధేయుడైన కర్ణుని కథ చూడండి. ఇతడు ఎంతటి వీరపురుషుడో అంతటి శాపగ్రస్తుడు. యుద్ధభూమిలో తన రథచక్రం నేలలో క్రుంగిపోతున్న సమయంలో తనకు సంక్రమించిన శాపాలన్నీ ఒక్కసారిగా దాడి చేయడంతో అర్జునుని శరాఘాతంతో నేలకొరుగుతాడు. కర్ణునికి సంక్రమించిన శాపాలన్నీ అతని స్వయంకృతాలే. తనకు మాలిన ధర్మాలే. తన మనుగడకే హానికరములని తెలిసినా కూడా తనకు మాలిన ధర్మాత్ముడైనాడు కర్ణుడు. నేడు హిందువులు కూడా అంతే. తమ మతం, సంస్కృతి అంతా మంటగలిసి పోతున్నదని తెలిసి కూడా తమకు మాలిన ధర్మాత్ములుగా వ్యవహరిస్తున్నారు. కర్ణుని చావుకు అనేక కారణాలన్నట్లుగా హిందు మత పతనానికి గూడా అనేక కారణాలు. తెలివి తక్కువ రాజకీయాలు, లౌకిక రాజ్యం, మతం మార్పు రాజకీయాలు, కుల వ్యవస్థ, ఆత్మద్రోహులు, సినిమాలు పత్రికలు ఇలా అనేక కారణాలు. హిందువులందరూ బాధ్యతారహితంగా ప్రవర్తిస్తూ, పరోక్షంగా అన్యమతస్థులకు వత్తాసునిస్తూ అందరూ తలొకరాయి విసురుతూ తమ మతాన్ని, సంస్కృతిని తామే నాశనం చేసుకుంటున్నారు.

# తెలివి తక్కువ రాజకీయాలు

ఒక జాతి యొక్క పురోగతి ఆ జాతిని నడిపించే నాయకులపై ఆధారపడి వుంటుంది. ఫ్రెంచి వారికి నెపోలియన్, జర్మనులకి అడాల్ఫ్ హిట్లర్, ఇటాలియన్లకి ముస్సోలిని, ఇంగ్లీషు వారికి చర్చిల్ వంటి నాయకులు ప్రపంచ చరిత్రలో సుప్రసిద్ధులు. భారతదేశంలో సుభాషు చంద్రబోసు, వీరసావర్కరు, పటేలు, భగత్‌సింగు, తిలక్, గాంధీ, నెహ్రూ వంటి జాతీయ నాయకులు ముఖ్యులు. స్వాతంత్ర్య పోరాటం కోసం అవతరించిన భారత జాతీయ కాంగ్రెసు మొదట్లోనే బ్రిటిషు వారు పెట్టిన బోనులో పడింది! అదేమిటంటే, దేశంలోని ప్రజలందరూ ఒకే త్రాటిన కలిసి వస్తేనే దానికి బ్రిటిషువారితో సంప్రదింపులకి గుర్తింపు వుంటుంది. ఈ షరతును అమలు పరచటం కోసమే కాంగ్రెసు గత వంద సంవత్సరాలుగా పడరాని కష్టాలు పడింది. ఎప్పుడు మత కలహాలు జరిగినా వెంటనే హిందువులను మందలించి, ముస్లిములను బుజ్జగించి శాంతిని నెలకొల్పేది కాంగ్రెసు. స్వాతంత్ర్యానంతరం దేశంలో శాంతి భద్రతలు కరువై హిందూ ముస్లింల మధ్య కొట్లాటలు జరుగుతాయన్న నెపంతో తమకు నమ్మకం కుదిరేదాకా స్వాతంత్ర్యం ప్రకటించబోమని బ్రిటిషువారు బెదిరించేవారు. హిందూ ముస్లింల మధ్య సయోధ్య కరువైతే దేశ విభజన జరిగే ప్రమాదముందని భయపడి గాంధీజీ వంటి నాయకులు మత కలహాలు తలెత్తకుండా ఎప్పుడూ హిందువులను మందలించేవారు. ముస్లిముల తరపున సత్యాగ్రహం చేపట్టేవారు. చివరకు ఏమి జరిగింది? లౌకికతత్వం వెక్కిరించింది. పాకిస్తాను అవతరించింది. "నా శరీరాన్ని విభజించండి, భారత్‌ను కాదు" అన్న గాంధీజీ ఆక్రోదన అరణ్యరోదనమే అయింది. "పాకిస్తాన్ అవతరణ ఒక హాస్యాస్పదమైన వాగుడు" అన్న నెహ్రూజీ గానీ "ఇండియా విభజన ఒక పెద్ద జోక్" అన్న సర్దార్ పటేలు గానీ వీరెవ్వరూ దేశ విభజనను నివారించలేకపోయారు. లౌకికతత్వం హిందువులకి మాత్రమే పరిమితం కాబడి ఇస్లామిక్ పాకిస్తాన్ అవతరించింది. "హస్‌తే లేలియె పాకిస్తాన్, లఢ్‌కే లేంగే హిందుస్తాన్" అన్న ముస్లింల ప్రగల్భాలు నిజమని నిరూపించాయి. మొదట్నుంచీ మన నాయకులు అవలంబించిన తెలివి తక్కువ రాజకీయాల వల్ల భరత ఖండం రెండుగా చీలింది.

భారతదేశానికి స్వతంత్రం ఇవ్వటానికి అంగీకరించిన బ్రిటిషువారు పాకిస్తాను అవతరణను సూత్రప్రాయంగా ఆమోదించి జనాభా పంపిణీ, భూభాగం విషయమై 1941 సంవత్సరం ప్రాతిపదికగా నిర్ణయించారు. అంటే 1941 జనాభా నిష్పత్తి ప్రకారం జనాభా, భూభాగం పంపిణీ జరుగుతుంది. కాని దేశ విభజన అనివార్యమై, పాకిస్తాను అవతరణ

నిశ్చయమని తేలిపోయినా గాని ఇంకా లౌకిక తత్వం పిచ్చి వదలని మన జాతీయ నాయకులు మత ప్రాతిపదిక పై జనాభా పంపిణీని వ్యతిరేకించారు. అందుకు హిందువులెవరూ సహకరించరాదని, హిందువులెవరూ తమ పేర్లను జనాభా లెక్కల్లో నమోదు చేసుకోరాదని పిలుపునిచ్చారు. దీనికి విరుద్ధంగా ముస్లిం లీగు ఇచ్చిన పిలుపు మేరకు ముస్లింలంతా తమ పేర్లను నమోదు చేసుకోవడంతో పాకిస్తానుకు 62 శాతం భూభాగం దక్కింది. మనకు 38 శాతం భూభాగం, 45 శాతం జనాభా మాత్రమే దక్కాయి. మొదట్నుంచీ ద్విజాతి సిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తూ, వాస్తవాలను చూడలేక తెలివి తక్కువగా ప్రవర్తించడం వల్ల హిందువుల యుగయుగాల వారసత్వం అన్యాక్రాంతమైంది. దేశం రెండు ముక్కలైంది. దేశ విభజనతో హిందువుల రక్తం ఏరులై పారింది. తెలంగాణాలో నైజాం స్వాతంత్ర్యం ప్రకటించుకుని హిందువుల నందరినీ భయభ్రాంతుల్ని చేసి పారిపోయేటట్లు చేశాడు. కాసిం రజ్వి నాయకత్వంలో రజాకార్లు జరిపిన అత్యాచారాలు తెలంగాణా చరిత్రలో ఒక చెదిరిపోని దుస్వప్నం. రజాకార్లు సాగించిన మారణహోమం గురించి పత్రికలన్నీ ఏకరువు పెడుతున్నా గాని కాంగ్రెసు నేతలెవ్వరూ ఆ దుశ్చర్యలను ఖండించలేదు. ముస్లిం మనో భావాలకు విఘాతం కలిగిస్తూ రజాకార్లను ఖండించడం లౌకికతత్వానికి విరుద్ధమని భావించిన కాంగ్రెసు, మన దేశంతో ఏమాత్రం సంబంధం లేని ఖిలాఫత్ ఉద్యమాన్ని మాత్రం బలపరచింది. తెలివి తక్కువ రాజకీయాలకింత కంటె ఋజువేం కావాలి?

గాంధీ మహాత్ముడంతటి వాడు దేశవిభజనను నివారించలేకపోగా పాకిస్తానుకు తరలిపోతున్న ముస్లిములెవరూ గూడా హిందువుల ప్రతీకార చర్యకు భయపడి పారిపోరాదని, అందుకు హిందువులందరూ ముస్లింలకు ధైర్యం చెప్పాలని ఆదేశించాడు. ఒక వంక కరాచీ, నవఖాళీ, లాహోరు, ఢాకా వంటి పాకిస్తాన్ నగరాల్లో హిందువులను చిత్రవధ చేస్తుంటే ఇక్కడి ముస్లింలకు హిందువులు ధైర్యం చెప్పాలిట! గాంధీ గారి ఆదేశం మేరకు ఒక్క ముస్లిం గూడా భద్రతలేని కారణాన భారతదేశం విడిచివెళ్లగూడదు. ఇళ్లు వదలి పారిపోయిన ముస్లిములను వెనక్కి తిరిగి తీసుకువచ్చి వారికి పునరావాసం కల్పించాలి. ఇవన్నీ వట్టి మాటలు కావు. వీటన్నిటినీ తు.చ. తప్పకుండా అమలుపరచటం కోసం గాంధీజీ 1948 జనవరి 12వ తేదీన ఒక ఉపవాస దీక్షను ఆరంభించి, యీ షరతులన్నీ అమలు జరిగాకనే తన ఉపవాస దీక్షను విరమించాడు! అయితే, ఇంతటి అనర్ఘమైన, అయోగ్యమైన మంచితనానికి ఫలితం ఏమిటో తెలుసా? పాకిస్తాను గాంధీజీలోని అతిమంచితనాన్ని మెచ్చుకోకపోగా, గాంధీజీ యంతటి వాడు ముస్లింల భద్రత కోసం

సత్యాగ్రహం చేయడం భారత దేశంలో ముస్లింలపై జరుగుతున్న దాడులకు నిదర్శనం అని ప్రచారం చేసింది. ఫలితంగా పాకిస్తాన్లోని ముస్లింలు రెచ్చిపోయి హిందువులని మరింత చిత్రహింసలకు గురి చేశారు. మన దేశంలో ముస్లింల భద్రతకోసం సత్యాగ్రహం చేపట్టిన గాంధీజీ పాకిస్తాన్లో హిందువుల పై జరుగుతున్న దాడులపై ఎటువంటి వ్యాఖ్య చేయలేదు. ఇందులో ఆశ్చర్యం ఏముంది? హిందువుల స్వయం కృతాపరాధానికింతకంటె నిదర్శనమేముంది? అంతే కాదు మితిమీరిన భావదాస్యానికి ఒక చిన్న ఉదాహరణ చూద్దాం. పాకిస్తాను ఏర్పాటుకు అధిక సంఖ్యాకులైన హిందువుల మద్దతు లభించదు గనుక తమ సంఖ్యాబలాన్ని పెంచుకో తప్పదని భావించిన ముస్లింలు హిందువుల్ని అధిక సంఖ్యలో మతం మార్చసాగారు. ఈ విశ్వ ఇస్లాం ఉద్యమానికి డాక్టరు అబ్దుల్లా సుహ్రావర్దీ వంటి అగ్రనాయకుని ఆశీస్సులు పుష్కలం. అయితే ఈ కార్యక్రమాన్ని నిరోధించి హిందువుల మతం మార్పిడిని అరికట్టాలని నిశ్చయించినవారిలో స్వామి శ్రద్ధానంద ఒకరు. మతం మార్చుకున్న వారి కోసం ఒక శుద్ధి కార్యక్రమాన్ని చేపట్టిన స్వామి శ్రద్ధానంద 1923లో ఉత్తరప్రదేశ్లో అనేక మంది ముస్లింలను తిరిగి హిందూ ధర్మంలోకి తీసుకువచ్చారు. ఈ విధమైన శుద్ధి కార్యక్రమం వలన తమ విశ్వ ఇస్లాం ఉద్యమం కుంటుపడుతున్నదని భావించిన ముస్లిం ముల్లాలు స్వామి శ్రద్ధానంద పై పగ బట్టారు. 1926 డిశంబరు 23వ తేదీన, అస్వస్థులుగా తన స్వగృహంలో శయనించి వున్న శ్రద్ధానందను అబ్దుల్ రషీద్ అనే యువకుడు తన రివాల్వరుతో కాల్చి చంపాడు. అయితే యీ సంఘటనకు పరాకాష్ఠ ఎక్కడంటే గాంధీజీ అబ్దుల్ రషీద్ను సోదరుడిగా వర్ణించి సమర్థించడమే! గాంధీజీ యీ సందర్భంగా ఏమన్నారో చూడండి -

"నేను అబ్దుల్ రషీద్ను సోదరుడని ఎందుకు సంబోధించానో అర్థం చేసుకున్నారనుకుంటాను. అదే మాట పునశ్చరణ చేస్తున్నాను. స్వామి హత్యకు అతడిది నేరమని కూడా నేనంగీకరించను. ఒకరి మీద మరొకరికి ద్వేషభావం రెచ్చగొట్టిన వారే నేరస్తులు."

- గాంధీజీ

ఇది ఎంతటి దురదృష్టకరమో చూడండి! హిందువులు తమరినెవరైనా బలవంతంగా మతం మారుస్తుంటే ప్రతిఘటించడం నేరమా? కాంగ్రెసు పార్టీలోని ప్రముఖ సీనియర్ నాయకుడు అసఫ్అలీ, అబ్దుల్ రషీద్ తరపున ఎంత వాదించినా ప్రయోజనం లేకపోయింది. బ్రిటిషు ప్రభుత్వపు నిష్పక్షపాత వైఖరి వల్ల అబ్దుల్ రషీద్కు మరణ శిక్ష విధించడమైంది. ముస్లింలు రషీద్ను అమరజీవిగా వర్ణిస్తూ అతని ఆత్మశాంతికై ప్రత్యేక

నమాజులు వల్లించారు. కాని హిందువులొక్కరు కూడా స్వామి శ్రద్ధానంద మృతికై సంతాపం ప్రకటించలేదు.

సరే... ఎవరేమనుకున్నా గాని హిందువులు సాధు మనస్కులు, శాంతిప్రియులు. ఈ కారణంగానే గత ఏడు శతాబ్దాలుగా ముస్లిం పరిపాలనలో తామనుభవించిన చిత్రవధను మర్చిపోయి ముస్లింలతో సఖ్యతకై తమ స్నేహ హస్తాన్ని చాచారు. ఇది హిందువుల్లోని హృదయోన్నత్యానికి నిదర్శనం. చివరకు దేశ విభజనను సైతం పెద్ద మనసుతో అంగీకరించి పాకిస్తానుతో సఖ్యతను కోరుకున్నారు. పాకిస్తాను అవతరణతో హిందూ ముస్లింల శతృత్వానికి శాశ్వత సమాధి కట్టబడుతుందని భావించిన హిందువులకి తిరిగి నిరాశే మిగిలింది. మతతత్వ శక్తిగా అవతరించిన పాకిస్తాన్ అదే మతం పేరుతో కాశ్మీర్లో చిచ్చురేపింది. మతవాదం పడగ విప్పి ఉగ్రవాదం జడలు విప్పింది. నేడు కాశ్మీర్లో దిక్కులు పిక్కటిల్లే నినాదాలు ఏమిటో తెలుసా? “అజాదీ కా మతలబ్ క్యా హై? లా ఇల్లాహి ఇల్లిల్లా”. ‘హిందుస్తానీ కుత్తే, వాపస్‌జావో’ ఇదీ మన లౌకిక తత్వానికి, కాశ్మీరీ ప్రజల ప్రత్యేక చట్టాలకి లభించిన ప్రతిఫలం! ఈనాడు సరాసరి గాంధీ గారే స్వయంగా దిగివచ్చి ప్రచారం చేసినా జనాభిప్రాయ సేకరణంటూ జరిగితే కాశ్మీరీలంతా భారత్ నుండీ విడిపోతామనే అంటారు. హిందువులు, ముస్లింలు అంటూ ప్రజలను మతం పేరుతో విడదీయరాదని, రామ్ రహీంలంతా ఒక్కటేనని, ఈశ్వర్ అల్లా ఒకటేననీ గొంతెత్తి అరిచినా అది అరణ్యరోదనమే అవుతోంది. కాశ్మీరీ ప్రజలు మతఛాందసులు కాదు, వారు పాకిస్తాన్ ఎత్తుగడలకు మోసపోరు అనే మన నాయకుల ప్రవచనాలకు నవ్వాలో ఏడ్వాలో తెలీడం లేదు. స్థానిక ముస్లింల సహాయ సహకారాలు లేకుండా కాశ్మీర్లో ఎవరూ ఉగ్రవాదాన్ని ప్రేరేపించలేరు. నాటి దేశ విభజన చివరి అంకం నేడు కాశ్మీర్లో తిరిగి ప్రదర్శించబడుతుంటే మన నాయకులు తమ కళ్లను, చెవులను మూసుకుంటున్నారు. రోము నగరం తగలబడుతుంటే నీరో చక్రవర్తి ఫిడేలు వాయిస్తున్నట్లు. ఎంతటి తెలివి తక్కువ రాజకీయాలు?

# లౌకిక రాజ్యం

భారత దేశం భ్రష్టమవటానికి ప్రధాన కారణం లౌకికతత్వం. స్వాతంత్ర్య పోరాట సమయంలో విభజించి పాలించు అనే ఎత్తుగడతో బ్రిటిషువారు హిందూ ముస్లింల మధ్య విభేదాలు తేవడానికి ప్రయత్నిస్తుండటంతో భారత జాతీయ కాంగ్రెసు ప్రజల్లో లౌకికతత్వం అవసరమని భావించింది. ఇది అప్పుడే గాదు ఎప్పటికీ గూడా మంచిదే, సరిగ్గా ఆచరిస్తే!

ప్రజల్లో లౌకిక భావాలను పెంపొందింపజేయడానికి రామ్‌రహీంలు ఒకటేనన్నారు. ఈశ్వర్ అల్లా తేరేనామ్ అన్నారు. హిందూ ముస్లిం భాయి భాయి అన్నారు. కాని యీ లౌకిక తత్వం వలన ఏమాత్రం ప్రభావితులు కాని ముస్లిములు తమకు పాకిస్తాను కావలసిందేనని పట్టుబట్టారు. స్వతంత్ర భారతదేశానికి మహమ్మదాలీ జిన్నాను ప్రధానిగా చేయగలనని, దేశాన్ని మతపరంగా విభజింపవద్దని గాంధీజీ ఎంత చెప్పినా వినిపించుకోని జిన్నా బ్రిటిషు పాలకుల మద్దతుతో భరత ఖండాన్ని రెండుగా చీల్చాడు. ఏ లౌకిక విధానం కోసం భారత జాతీయ కాంగ్రెసు అవిరళ కృషి చేసిందో, ఏ మతసహనం కోసం హిందువులు తమ ఆత్మగౌరవాన్ని సైతం త్యాగం చేశారో, ఏ మతం పేరుతో దేశ విభజనను నివారించదలిచారో ఆ విధానం, అటువంటి లౌకికతత్వం ఆచరణ సాధ్యం కాదని, అందరికీ అది ఆమోదయోగ్యం కాదని ఆనాడే తేలిపోయింది. నిజానికి పాకిస్తాన్ ఏర్పాటైన మరుక్షణమే హిందుస్తానుగా, అంటే భారతదేశాన్ని హిందూ రాజ్యంగా, హిందూ మతానికి రాజ్యాంగ హోదా కల్పించి వుండవలసింది. ఇదే న్యాయం, ధర్మం అయినప్పటికీ పురుడు చచ్చినా, పురుటి వాసన పోలేదన్నట్లు దేశ విభజన జరిగిన తర్వాతనైనా మన నాయకులకు జ్ఞాననేత్రం తెరుచుకోలేదు. పటాపంచలైన లౌకిక మంత్రాన్నే నేటికీ జపిస్తూ భారతదేశాన్ని హిందూ దేశంగా ప్రకటించలేకపోయారు. దాని పాప ఫలమే నేడు మనం అనుభవిస్తున్నాము. భారత రాజ్యాంగంలో లౌకికతత్వం అనే అంశాన్ని ప్రవేశపెట్టిన వారంతా దేశ విభజనను కళ్లారా తిలకించిన వారే. కానీ జరిగిన నష్టం చాలలేదన్నట్లు వీరెవ్వరూ లౌకిక రాజ్యాంగాన్ని వ్యతిరేకించలేకపోయారు.

మన రాజ్యాంగం యీ విధంగా వుండటానికి కారణం మన రాజ్యాంగాన్ని మనకు గిట్టని వాళ్లెవరో తయారు చేయలేదు. మన రాజ్యాంగ రచనా కమిటీ అల్లాడి కుప్పుస్వామి అయ్యరు, కెకె. మున్షీ, టి.టి.కె. మొదలుగా ఏడుగురి సభ్యులతో, డా॥ భీమరావు అంబేద్కరు అధ్యక్షతన 29-8-1947న ఏర్పడింది. మొత్తం 7,635 సవరణలు జరిపిన తర్వాత మన రాజ్యాంగంపై 26-11-1949న డా7। రాజేంద్రప్రసాద్ ఆమోదముద్ర పడింది. మొదట ఆమోదించిన దానిలో లౌకికతత్వం చేర్చకపోయినా, తరువాత 1976వ సంవత్సరంలో 42వ సవరణలో దీనిని చేర్చి తమ పురోభివృద్ధికి తామే శాశ్వతమైన అవరోధం కల్పించుకున్నారు హిందువులు. ఇది ముస్లిములకు కూడా ఆశ్చర్యం కలిగించిన విషయం. పాకిస్తాను అవతరణకు ముస్లింలు చేసిన విన్నపం ఏమంటే భారతదేశంలో హిందువులు సంఖ్యాపరంగా అధికులు గనుక స్వాతంత్ర్యానంతరం అధికారంలో హిందువులే ఎక్కువ వుంటారు గనుక ముస్లింలను వారు నిర్దాక్షిణ్యంగా అణచివేస్తారని, ముస్లింలకు న్యాయం

జరగదని భాతదేశం మత ప్రసక్తి గల హిందూ రాజ్యంగా మారగలదనీ, అందుకని, ముస్లింల కోసమని ఒక ప్రత్యేక దేశం పాకిస్తాను కావలసిందేనని, పట్టుబట్టి సాధించుకున్న ముస్లింలంతా మరి భారతదేశం విడిచివెళ్ళలేదేమి? నేడు ఇక్కడింకా ఇంత మంది ముస్లింలున్నారే? వెళ్ళని దానికి దేశాన్ని ఎందుకు విభజించారు? పాకిస్తాన్లో వుండిపోయిన హిందువులను లెక్క చేయకుండా తమది ఇస్లామిక్ దేశంగా ప్రకటించుకుంటారా? ఇక్కడ కావాలని వుండిపోయిన ముస్లింల కోసం మనం హిందూ రాజ్యంగా ప్రకటించుకోగూడదా? ఏం న్యాయం? దేశ విభజన గనుక జరిగితే భారతదేశం హిందూ రాజ్యంగా మారగలదని డా॥ అంబేద్కరు ముస్లింలను హెచ్చరించాడు గూడా.

"జిన్నా గారు ముస్లిం లీగును ముసల్మానులకు ఏకైక సంస్థగా చేసి సాధించినదేమిటో ఒకమారు ముస్లింలు ఆలోచించుకోవాలి. లీగు ముస్లింలను హిందూ రాజ్యం నుంచీ ఎలా రక్షించగలదు? ముస్లింలు అల్ప సంఖ్యాకులుగానున్న రాష్ట్రాలలో హిందూ రాజ్యం ఏర్పాటు కాకుండా చేయగలదా? హిందుస్తానులో వుండిపోయే ముస్లిం అల్ప సంఖ్యాకుల మీద కేంద్రంలో హిందూ రాజ్య స్థాపనను అపగలదా? ముస్లిం లీగు రాజకీయాలకన్నా వ్యర్థమైనది వేరే ఏమైనా వుంటుందా?"

**- డా॥ అంబేద్కరు**

# లౌకిక తత్వం వల్ల నష్టం?

**మ**న దేశంలో ముస్లిములకేదైనా హాని జరిగితే, ముస్లింలపై ఎవరైనా దాడి జరిపితే ముందు స్పందించేది హిందువులు! ఇదే మన దేశ ప్రత్యేకత! లౌకిక విధానం వలన హిందువులకొచ్చిన నష్టమేమిటి? పాకిస్తాన్ గడ్డి తింటే మనమూ తినాలా? ముస్లింలు, హిందువులంటూ వేర్పాటువాదం ఎందుకు? ముస్లిముల వల్ల హిందువుల హక్కులకేమిటి భంగం? ఇట్లా వుంటుంది మన కుహనా లౌకికులవాదం. ఇటువంటి అనర్థమైన సమతావాదం వల్లనే దేశం రెండు ముక్కలైంది. అయినా హిందువులకి తగిలిన దెబ్బ చాలలేదు. ఇంకా లౌకికతత్వం వదల్లేదు. సరే... యీ లౌకికతత్వం వల్ల నష్టాలేమిటో చెప్పమంటారా? వినండి. బ్రిటిషువారి కాలంలో బెంగాలు విభజనను వ్యతిరేకిస్తూ భారతీయులంతా ముక్త కంఠంతో వందేమాతర గీతాన్ని గానం చేసేవారు. ఈ గీతాన్ని ప్రసిద్ధ వంగ రచయిత బంకించంద్ర ఛటర్జీ తన 'ఆనందమఠం' అనే నవల కోసం రాశాడు. ఈ గీతం భారతీయుల హృదయాలలో ఎంతటి విద్యుచ్ఛక్తి లాగా పని

చేసిందంటే చివరకు బ్రిటిషువారు యీ గీతం వల్ల తమ మనుగడకే ముప్పు వచ్చేట్లుందని దీనిని నిషేధించారు. ఆనాటి కాంగ్రెసు సభల్లో విధిగా అందరూ యీ గీతాన్ని గానం చేసేవాళ్లు. కానీ దీని పూర్తి పాఠం తమకు అంగీకారం కాదని ముస్లింలు అభ్యంతరం లేవదీయడంతో అందులో అభ్యంతరకరమైన భాగాలను కత్తిరించి మిగతాదే గానం చేసేవారు. మనం భారతమాతను ఒక దేవతగా భావించి పూజిస్తాం. కానీ విగ్రహారాధనకు వ్యతిరేకమైన ఇస్లాం దీనికి అంగీకరించదు గనుక ముస్లింల అభ్యర్థన మేరకు అందులోని కొద్ది భాగాన్ని మాత్రమే వుంచారు. ఇది అప్పుడెప్పుడో చేస్తే అర్థం వుంది. కాని దేశ విభజన జరిగిన తర్వాత గూడా మనకి ముస్లింలతో మొహమాటం దేనికి? వందేమాతర గీతాన్ని మన జాతీయ గీతంగా ఎందుకు చేసుకోలేకపోయాం! ఐచ్ఛికంగా, కావాలని ఇక్కడే వుండి పోయిన ముస్లింల ఇష్టాయిష్టాలతో పని ఏమిటి? మన జాతీయ గీతం వందేమాతరం కాలేకపోవటానికి లౌకికతత్వం ఒక అవరోధం కాదా?

ఇంక మన జాతీయ పతాకం విషయానికి వస్తే, ఒక్కొక్క రంగుకు గల అర్థాన్ని విపులీకరించి చెపితే తప్ప తెలియని మూడు రంగుల జెండాను మన జాతీయ జెండాగా నిర్ణయించుకున్నాము. కాని భారతీయులకి వేదకాలం నుండి వస్తున్న కాషాయ జెండాను మన జాతీయ జెండాగా ఎందుకు చేసుకొనలేకపోయాము? కాషాయ జెండా సెక్యులర్ భావాలకు వ్యతిరేకం గనుక దీనిని అసలు పరిశీలనలోకే తీసుకోలేదు. పాకిస్తాను తమకు మతపరమైన జెండానే జాతీయ జెండాగా నిర్ణయించుకుంది కాని లౌకికతత్వం కారణంగా మన కాషాయ జెండా జాతీయ జెండా కాలేకపోయింది. ఇంక పరిపాలనా విషయానికి వస్తే, యీ లౌకిక తత్వం ప్రభుత్వానికి, ప్రభుత్వాధికారులకి ఎన్నో చికాకులు కల్పిస్తున్నది. మన దేశ జనాభాను నియంత్రించి ఆర్థిక సంస్కరణల కోసమని ప్రభుత్వం కుటుంబ సంక్షేమ కార్యక్రమాన్ని ప్రవేశపెట్టింది. అయితే సెక్యులర్ రాజ్యాంగంలో మైనారిటీ మతస్తుల మనోభావాలకు భంగం వాటిల్లకుండా దీనిని అమలుపరచే విషయం ప్రజల అభీష్టానికే వదిలివేసింది తప్ప నిర్బంధంగా అమలు చేయలేకపోతోంది. కుటుంబ నియంత్రణను వ్యతిరేకిస్తూ మైనారిటీ మతస్తులు ప్రభుత్వానికి నిరసన తెలియజేయడం కారణంగా, లౌకిక ప్రభుత్వం యీ కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వర్తించలేకపోతోంది. ముస్లిం న్యాయ చట్టాలు, ప్రత్యేక సివిల్ కోడ్, వివాహ చట్టాలు వంటి విషయాల్లో గూడా ప్రభుత్వం జోక్యం కల్పించుకోకపోవటానికి కారణం లౌకికతత్వం కాదా? హిందువుల శారదా యాక్టు, సతీ, వరకట్నం వంటి విషయాల్లో కఠినంగా శాసనాలను చేయగలిగిన ప్రభుత్వం మైనారిటీల విషయాల్లో అలసత్వాన్ని ప్రదర్శిస్తోంది. అంతేకాదు ఎన్నికల

సమయాలలో, నేర పరిశోధనా సమయంలో, అంతర్జాతీయ విమానాశ్రయాల్లో, ముస్లిం బురఖా స్త్రీలు ప్రభుత్వాధికార్లతో సహకరించక, తమ మతపరమైన హక్కులను ప్రస్తావిస్తారు. మన రాజ్యాంగంలో లౌకిక తత్వాన్ని ప్రవేశపెట్టి మైనారిటీ మతస్తులకు అనవసరమైన, అయోగ్యమైన హక్కులను కల్పించి న్యాయపరమైన చిక్కులను మనమే కొని తెచ్చుకున్నాము. హిందూ మతానికి రాజ్యాంగ హోదా కల్పిస్తే అన్యమతాలకు రవ్వంత హాని గూడా జరగదని తెలిసినా, హిందూ మతానికేమైనా మేలు జరుగుతుందేమోనన్నదే అన్యమతస్తులకి పట్టుకున్న భయం!

# మతాన్ని రాజకీయం చేస్తే నష్టం?

మతం కేవలం వ్యక్తిగతం. దానిని రాజకీయం చేయరాదు. పాకిస్తాను గడ్డి తింటే మనమూ తినాలా? హిందూ వ్యక్తి స్వేచ్ఛకు, మతప్రచారానికి, హిందూ మత పురోభివృద్ధికి లౌకిక తత్వం ఏ విధంగా అవరోధం? ఇదీ మన కుహనా లౌకికుల వాదన! అసలు రాజకీయం చేయటమంటే ఏమిటి? మనకి రాజకీయం అంటే దుష్ట రాజకీయమనే తప్ప వేరే అర్థం తెలీదు. ఒక వ్యక్తి సంఘంలో భాగమైనప్పుడు మతం వ్యక్తిగతం నుంచీ సాంఘికం కాక తప్పదు. కాకపోతే మసీదులో చేసే సామూహిక ప్రార్థనలు, చర్చిలో జరిగే దైవారాధన కూటములు, హిందువుల జాతరలు, ఉత్సవాలు వీటన్నిటికీ అర్థం లేదు. పూర్వం రాజులు తమ పరిపాలనా వ్యవహారాలలో ధర్మాధికారుల, మతాధికారుల అభిప్రాయాలను అడిగి తెలుసుకునేవారు. వారంతా మతాన్ని రాజకీయం చేసినట్లేనా? హైందవ ధర్మ రక్షణకు నడుం కట్టిన విద్యారణ్యస్వామి, శ్రీ కృష్ణదేవరాయలు, హిందూ మత రక్షణకై పోరాడిన ఛత్రపతి శివాజీ, వీరంతా మతాన్ని రాజకీయం చేసినట్లేనా? మతాన్ని స్వార్థ రాజకీయ ప్రయోజనాలకై వాడుకోవటం తప్పు. కాని ధర్మ రక్షణ, సంస్కృతీ పరిరక్షణకై ఉద్యమించటం రాజకీయమెలా అవుతుంది? మతాన్ని రాజకీయం చేసినందుకు కలిగే దుష్పరిణామానికి ఒకే ఒక ఉదాహరణ పాకిస్తాను అవతరణ. దీనికి నిందించవలసింది ఎవరిని?

భారతదేశాన్ని హిందూ రాజ్యంగా ప్రకటించినంత మాత్రాన మనం మైనారిటీలనెవరినీ తరిమివేయనక్కరలేదు, వారినెవరినీ ద్వేషించనక్కరలేదు, పాకిస్తాను ఏర్పడిన తర్వాత గూడా అక్కడ హిందువులున్నారు గదా? అయినా వారు పాకిస్తానును ఇస్లామిక్ రాజ్యంగా ప్రకటించుకోలేదా? అదే రీతిలో మనమూ చేస్తే ఆక్షేపణ ఎందుకు?

పాకిస్తాన్లో కంటె ఇక్కడ మైనారిటీలు హెచ్చు సంఖ్యలో వున్నారనా? వుండనివ్వండి. వారంతా ఇక్కడ కావాలని వుండి పోయిన వారే గదా? అట్టి వారి కోసం మనం త్యాగం చేయడమెందుకు? చేసిన పెద్ద త్యాగం దేశ విభజన చాలలేదా? హిందూ మతాన్ని, సంస్కృతిని అభివృద్ధి చేసుకుని, హిందువులను అన్యమతాల్లోకి మార్చటాన్ని నిషేధించి, హిందువుల మనో భావాలకు అనుకూలంగా రాజ్యాంగాన్ని సవరించుకోటానికి మధ్య యీ మైనారిటీల గోల ఏమిటి? మైనారిటీలు కోరవలసింది తమ మత సంస్థల నిర్వహణా హక్కులే తప్ప హిందూ మత పతనం కాదు. ఎనభై శాతం జనాభా కలిగిన హిందువులకి కొన్ని ప్రత్యేక హక్కులు, హోదా వుండటంలో తప్పు లేదు. పాకిస్తాన్ గడ్డి తింటే మనమూ అదే పని చేసి దానికింకా గడ్డి పెడదాం. అక్కడి మైనారిటీల కెంతటి హక్కులున్నవో ఇక్కడి మైనారిటీలక్కూడా అంతే హక్కులుండటం న్యాయం. ఉపఖండంలోని మైనారిటీ సమస్య సమతుల్యంగా వున్నపుడే దాని విలువ. విషానికి విషమే విరుగుడు.

# హిందూ రాజ్యం దేనికి?

**మ**నకు ఒక జాతీయ గీతం అవసరం. ఒక జాతీయ భాష, జాతీయ చిహ్నం, జాతీయ మృగం, జాతీయ విహంగం, జాతీయ పుష్పం వగైరాలన్నీ అవసరం. కానీ మనకు ఒక జాతీయ మతం మాత్రం వద్దు. ఎందుకని? దేశంలో అనేక మతాల వారున్నపుడు ఏదో ఒక మతానికి మాత్రమే జాతీయ హోదా కల్పించటం ఎలా? ఇదీ మనకి పట్టుకున్న సమస్య. సరే.... దేశంలో ఎన్నో భాషలున్నవి గదా? ఇన్ని భాషలున్న దేశంలో మరి హిందీకి మాత్రం రాజ్యాంగ హోదా కల్పించి రాజభాషగా చేశారే? మిగతా భాషల వారికి, ముఖ్యంగా ఉర్దూ మాట్లాడేవారికి కోపం రాదా? దీనికి కారణం ఏమంటే, దేశంలో హిందీ మాట్లాడేవారు అధిక సంఖ్యాకులు గనుక హిందీని జాతీయ భాషగా చేశామన్నారు. అదే విధంగా దేశంలో హిందువులు అధిక సంఖ్యాకులు గనుక హిందూ మతానికి రాజ్యాంగ హోదా ఎందుకు కల్పించరు? ఈ ప్రశ్నకు మాత్రం సమాధానం దొరకదు!

నిజానికి భారతదేశాన్ని హిందూ రాజ్యంగా ప్రకటించినంత మాత్రాన హిందువులకేదో కొత్తగా మంత్రశక్తులు రావు. ఇక్కడి మైనారిటీలకు నూకలూ చెల్లవు. మరి ఏమీ లేని దానికి ఎందుకీ అభ్యర్థన? ఎందుకంటే, హిందువుల్లో మతం పట్ల శ్రద్ధ, సాహసం గనుక వున్నట్లైతే రాజ్యాంగం ఏ విధంగా వున్నా నష్టం లేదు. ఉదాహరణకు

పాకిస్తాన్లో ఇస్లాం అధికార మతమైనా కాకపోయినా వారికొచ్చిన నష్టమేమీ లేదు. ఎందుకంటె అక్కడ ఇస్లాం మతాన్ని ఎవరైనా అవహేళన చేసినా, ముస్లిముల్ని అన్యమతాల్లోకి మార్చదలచినా దానికి ప్రభుత్వమే కల్పించుకోనక్కరలేదు. ప్రజలే వారికి తగిన శాస్తి చేస్తారు. పాకిస్తాన్లో గోడల మీద క్రైస్తవ సందేశాలు రాసినందుకు ఎంత శాస్తి జరిగిందో మనందరికీ తెలుసు. అట్లానే క్రైస్తవ దేశాల్లో ప్రభుత్వ ప్రోత్సాహం ఉన్నా లేకపోయినా, క్రైస్తవ మతాన్ని ప్రచారం చేయటానికి, పెంచి పోషించటానికి అక్కడ ఎన్నో సంస్థలున్నవి. ఇంక ఎవరూ లేని అనాథ మన హిందూ మతమే! దేవాలయాల్ని పేల్చివేసినా, హిందూ మత గ్రంథాలను తగులబెట్టినా, హిందువుల్ని సాముహికంగా మతం మార్పిడి చేయిస్తున్నా హిందువులెవరూ చలించరు. హిందూ మత రక్షణకు హిందువులెవరూ పూనుకోరు కనుక ప్రభుత్వమే దీనికి నడుం కట్టాలి. అయితే రాజ్యాంగ హోదా లేకుండా ప్రభుత్వం హిందూ మత అభివృద్ధికి పూనుకుంటే ఎన్నో న్యాయపరమైన చిక్కులు ఎదురవుతాయి. అందుకు తప్పనిసరిగా హిందూ మతానికి రాజ్యాంగ హోదా ఇవ్వాలి. ప్రపంచంలో ఎన్నో దేశాలు ఇస్లాం క్రైస్తవం వ్యాప్తి కోసం వుండగా హిందూ మతం కోసం మన ఒక్క దేశమైనా వుండటంలో తప్పు లేదు. ఎనభై శాతం హిందువులున్న దేశంలో హిందూ మతానికి రాజ్యాంగ హోదా, హిందువులకు కొన్ని ప్రత్యేక హక్కులు, సదుపాయాలుండటంలో అనౌచిత్యమేమీ లేదు. భారతదేశాన్ని హిందూ రాజ్యంగా ప్రకటించినప్పుడే మనం చేసిన తప్పును దిద్దుకున్న వారమవుతాం.

## మతం మార్పు రాజకీయాలు

భారత దేశం ఏడు శతాబ్దాలు ముస్లిం పాలన కింద మరి రెండు శతాబ్దాలు క్రైస్తవ పాలన కింద వున్నప్పటికీ వీరి పాలనలో హిందూ మతం సమూలంగా నాశనం కాకపోవటం గొప్ప విశేషం. హిందువుల యుగయుగాల పుణ్య ఫలమో లేక ఏ అదృశ్య దేవతల ఆశీస్సుల వరమో గాని హిందూ మతం తన మౌలిక ధర్మంతో నేటికీ సజీవంగా నిలిచివుంది. కాని అన్యమతస్తుల పాలనలో కంటె స్వమతస్తుల పాలనలోనే హిందూ మతం నేడు నష్టపోతోంది. నేడు పాలకులు హిందువులు. పాలితులు హిందువులు. అధికారులు, అనధికారులు, ప్రజలు, శాసనకర్తలు అందరూ హిందువులే. అయినా గాని దేశ జనాభాలో మూడు శాతం గూడా లేని క్రైస్తవులు విచ్చలవిడిగా, బహిరంగంగా, హిందూ మతాన్ని అవహేళన చేస్తూ లక్షలాది హిందువులను తమ మతంలో కలుపుకుంటున్నారు. క్రైస్తవ మత ప్రచారానికి, వారి మతం మార్పిడి కార్యక్రమానికి ఎట్టి

అవరోధము లేకుండా మన రాజ్యాంగంలో 28 మరియు 30వ అధికరణం కింద వీరికి మత ప్రచారం, ప్రత్యేక హక్కులు కల్పించాము. దీనికి మనం వారిని నిందించి ఏం ప్రయోజనం? స్వామి వివేకానంద చెప్పినట్లుగా "క్రైస్తవ మత ప్రచారకులు మీ ఎదుటనే హిందూ మతాన్ని రోజూ నిందిస్తూనే వున్నారు. జరుగుతున్న యీ అన్యాయాన్ని చూస్తూ ధార్మికమైన ఉద్వేగంతో నెత్తురు పొంగే స్వమత సంరక్షకులు మీలో ఎంత మంది వున్నారో అర్థం కావడం లేదు."

అసలు ప్రపంచంలో మరెక్కడా చోటు లేనట్లు యీ క్రైస్తవ మిషనరీలంతా భారతదేశాన్నే ఎందుకు ఆశ్రయిస్తున్నారో తెలుసా? ఆసియా ఖండంలో కొంత భాగం ఇస్లాం, మరికొంత భాగం కమ్యూనిజం ఆక్రమించుకుని వున్నాయి. ఈ రెంటి చోట్ల క్రైస్తవ మతానికి ప్రవేశం లేదు. ఇక ఎటువంటి ఆంక్షలు లేని దేశం మనదొక్కటే! ఇక్కడి హిందువులు తమకు మాలిన ధర్మాత్ములు! ప్రభుత్వం గూడా తన లౌకిక విధానాలతో, మైనారిటీల ప్రత్యేక హక్కులతో క్రైస్తవ మత ప్రచారకులకు అనువైన వాతావరణం కల్పించింది. హిందువుల్లోని అంతఃకలహాలు, కుల వ్యవస్థ, హిందువులకి మతం పట్ల గల అశ్రద్ధ, అలసత్వం ఇవన్నీ భారతదేశంలో క్రైస్తవ ప్రచారానికి అనుకూల ఋతుపవనాలుగా తోచాయి. హిందువుల మెదడులో క్రైస్తవ విత్తనాలు చల్లి భారతదేశంలో ఇతోధికంగా క్రిస్మస్ చెట్లను పండించుకోగలమనే ఆశతో మిషనరీలంతా భారతదేశం వైపు బయలుదేరారు.

అసలు ఈ క్రైస్తవ మిషనరీలందరి ధ్యేయం ఏమిటి? మానవ సేవా? అయితే సేవతో తృప్తిపడక మతం మార్పులు చేయించడమెందుకు? బైబిలులోని మంచి విషయాలను బోధించడానికి మతం అడ్డు వచ్చిందా? దానికి హిందూ మత దూషణ ఎందుకు? "హిందూ మతం ఒక నిర్దుష్టమైన, శాస్త్రీయమైన మతం కాదు. వీరికి ఒక మత గ్రంధమంటూ లేదు. వేదాల్లో ఏమున్నదో ఎవరికీ తెలీదు. వీరికొక ఆరాధనా పద్ధతి అంటూ లేదు. శైవులు, వైష్ణవులు, మధ్వులు ఇట్లా ఒక్కొక్కరిది ఒక్కో పద్ధతి. ఇన్ని పురాణాలు, ఇన్ని మత గ్రంథాలు, ఇంత మంది దేవతలు, ఇదంతా శాస్త్రీయమైన మతమేనా?' ఇట్లా విమర్శిస్తుంటారు మిషనరీలు. నక్క పుట్టి నాలుగు వారాలైనా కాలేదు గొంతెత్తి అరిస్తే అన్ని భయపడతాయని అనుకుందిట! క్రైస్తవం పుట్టి నేటికి రెండు వేల సంవత్సరాలు కూడా నిండలేదు. కాని ఎనిమిది వేల సంవత్సరాల నాటి సంస్కృతి కలిగిన హిందూ మతాన్ని విమర్శించటం హనుమంతుడి ముందు కుప్పి గంతుల్లాగా వున్నది. హిందూ మతం ప్రపంచ మానవాళికి ఎంతటి గొప్ప ఆధ్యాత్మిక సంపదనిచ్చిందో,

మాయామయ జగత్తును గురించి ఎంతటి వేదాంత రహస్యాలను వెలికి తీసిందో, కుక్క గొడుగుల్లాగా వెలిసిన యీ మిషనరీలకేం తెలుసు? ఈ ఆర్యావర్తం, ఒక అద్భుత ఆధ్యాత్మిక కేంద్రంగా విలసిల్లి ప్రపంచ మానవాళికి ఈశ్వర తత్వాన్ని గురించి బోధించింది. ఇంతటి మహోత్కృష్టమైన ధర్మం అశాస్త్రీయమా? శైవులు, వైష్ణవులు, మధ్వులు మొదలుగా ఎన్నో శాఖలు గల హిందూ మతం భిన్నత్వంలో ఏకత్వాన్నే ప్రబోధించింది. ఏ శాఖలూ లేనిదే అయితే క్రైస్తవంలో కాథలిక్కులు, ప్రొటెస్టంట్లు, పెంతుకోస్తులు అంటూ ఇన్ని వర్గాలు, రకరకాల చర్చిలు ఎందుకు? దేముడొక్కడే అయితే మళ్లీ దేముని కుమారుడెవరు? ఒక్కటే మత గ్రంధమంటూనే మళ్లీ కొత్త నిబంధనలేమిటి? పాత నిబంధనలు బాగా లేవని కొత్తవి వ్రాసుకోవటం జరిగిందా. విమర్శించటం మనక్కూడా తెలుసు. భారత దేశంలో నివసించే అల్ప సంఖ్యాక వర్గాలతో మనకెట్టి శతృత్వము లేదు. వారందరూ మనలాగానే యీ దేశ పౌరులు. భక్తితో నమ్రతతో నమాజు చేసుకునే ముస్లింలు గాని, క్రమం తప్పకుండా చర్చిలో ప్రార్థన చేసుకునే క్రైస్తవులు గాని మనకెన్నడూ విరోధులు కారు. వీరంతా వారి వారి మతాన్ని గురించి కాక హిందూ మతంలోని తప్పొప్పుల సంగతి ప్రస్తావించినప్పుడే మనకి వారు శత్రువులు. హిందువులకు, హిందూ మతానికి ఎట్టి హాని తలపెట్టకుండా, హిందువుల మతం మార్పుల ద్వారా రాజకీయ లబ్ధిని పొందాలనుకోకపోతే మనకు మైనారిటీలంతా మంచి మిత్రులు. మతం మార్పులను గురించి తమ అభిప్రాయం అడిగినపుడు "నాకే గనుక అధికారం వుంటే యీ మతం మార్పులను తక్షణం నిషేధించేవాడిని" అన్నారు గాంధీజీ. గాంధీజీ కన్న కలలు నిజం చేయాలని, అనారోగ్యకరమైన, అవాంఛనీయమైన మతం మార్పులను నిరోధించి శాంతిభద్రతలను దేశ సంస్కృతిని పరిరక్షించాలనే ఉద్దేశంతో గతంలో ఒక ప్రయత్నం జరిగింది. శ్రీ మురార్జీ దేశాయి ప్రధాన మంత్రిగానున్నపుడు మతం మార్పులను నిషేధించే బిల్లు ఒకటి పార్లమెంటులో ప్రవేశపెట్టబడింది. అయితే యీ బిల్లు చర్చకు రాకముందే దేశంలోని క్రైస్తవ సంఘాలన్నీ నిరసన ప్రదర్శనలు జరిపాయి. మతం మార్పులు మైనారిటీల ప్రత్యేక హక్కులనే నినాదాలతో నిరసన ప్రదర్శనలు జరిపిన వారిలో ప్రముఖ సంఘ సేవకురాలు, భారత రత్న గ్రహీత మదర్ థెరిసా కూడా ఒకరు! క్రైస్తవ మతం కేవలం సేవా భావానికే అంకితమైనదని, విద్య వైద్య రంగాల ద్వారా దీనజన సేవ తప్ప వారికి వేరే లక్ష్యం లేదని భ్రమపడే అమాయక హిందువులను ఆశ్చర్యచకితుల్ని చేస్తూ మదర్ థెరిసా సైతం మతం మార్పులు కోరడం క్రైస్తవుల కుహనా సాంఘిక సేవను బహిర్గతం చేయడం లేదా? అయితే తరువాత జరిగిన రాజకీయ పరిణామాల వల్ల ఆ బిల్లుకి పురిట్లోనే సంధి కొట్టడం వలన, మతం మార్పులు తిరిగి యధేచ్ఛగా కొనసాగుతున్నవి.

రామ్ రహీంలు ఒక్కటే. ఈశ్వర్ అల్లా మరియు జీసస్ పేర్లు మాత్రమే వేరు కాని గమ్యం ఒక్కటే అనేవన్నీ కేవలం శుష్క నినాదాలేనా? లేకపోతే, యీ మతం మార్పులకి అర్థం ఏమిటి? రాముడు దేముడు కాదని, జీసస మాత్రమే దేముడని అర్థమా? దారులే కాదు గమ్యం కూడా వేరని అర్థమా? లేకపోతే ఎందుకీ మతం మార్పులు? ఒక మతంలోని మంచిని, ధర్మ సూత్రాలను బోధించడానికి విధిగా మతం మార్చడం ఎందుకు? ఒక వ్యక్తిని అతని సంఘం నుంచీ, సంస్కృతి నుంచీ దూరం చేయడం ఎందుకు? అన్ని మతాల సారము ఒక్కటేనన్న మన కుహనా లౌకిక వాదుల మాటలన్నీ ఒక్క హిందువులకే పరిమితం చేయబడినాయా? జాతి సమైక్యతకు, శాంతి భద్రతలకు, మన సంస్కృతికి భంగకరమైన యీ మతం మార్పులను నిషేధించటానికి ప్రభుత్వానికెందుకింత సందేహం? అయినా, ఎక్కడైనా ఒక మతస్తులు తమ మతంలోని గొప్ప తనాన్ని గూర్చి ప్రచారం చేసుకోవడం సహజం. కాని క్రైస్తవ మత ప్రచారకులు దీనికి విరుద్ధం. క్రైస్తవ మతంలోని మంచిని గురించి చెప్పడానికి బదులు హిందూ మతంలోని చెడుని గురించి ఎక్కువగా చెప్పడమే వారి ప్రత్యేకత! ఎందుకంటే ఇటువంటి వ్యతిరేక ప్రచారం ఒక్క యీ హిందూ దేశంలోనే సాధ్యం! 'హిందూ మతం ఒక మతం కాదు. అది ఒక జీవన విధానం మాత్రమే. హిందువులకి ఒక దేముడంటూ లేడు. ముప్పై మూడు కోట్ల మంది దేవతలు. వీరికి ఒక మత గ్రంధమంటూ లేదు. వీర్వెరికీ తమ మతం గురించి ఏమీ తెలీదు. రాతి విగ్రహాలను పూజించే మతం ఏం మతం?' ఇదీ వరస. క్రైస్తవ మిషనరీలు గొంతు చించుకుని రోజూ చేసే ప్రసంగాలన్నీ ఇవే. నిజమే, హిందూ మతం ఒక మతం కాదు. అది ఒక జీవన విధానం మాత్రమే అనుకుందాం. మరి క్రైస్తవం మాత్రం జీవన విధానం లేనట్టి మతమని అర్థమా? అచరించనట్టి, జీవన విధానం లేనట్టి మతాల వల్ల ఏం ప్రయోజనం? ఊరికే పుస్తకాలు, నిబంధనలు మాత్రం వుండి జీవన విధానం మరోలా వుంటే అది శాస్త్రీయమా. హిందువలది కేవలం జీవన విధానమే అయితే అది నిజంగా పరమోత్కృష్టమైన విధానమని చెప్పవచ్చు. అది ధర్మ, నైతిక సూత్రాలతో కూడుకున్న విధానం. తనకు మాలిన ధర్మంగా, అత్యంత సహనశీలురుగా, అహింసావాదులుగా జీవించబట్టే ఈ దేశంలో అన్య మతాలు వేళ్లూనుకున్నవి. మత సిద్ధాంతాలు ఎంత తియ్యగా వున్నప్పటికీ, జీవన విధానంలో కపటం, మోసం, దగా, హింస వుండబట్టి అన్య మతాలు హిందూ మతాన్ని అణగద్రొక్కి హింస ద్వారా మతం మార్పిడిల ద్వారా, సామదాన భేదోపాయోలను ప్రయోగించి తమ సంఖ్యా బలాన్ని వృద్ధి చేసుకుని రాజకీయ లబ్ధిని పొందగలుగుతున్నాయి. హిందువులకి మతం, జీవన విధానం రెండూ ఒక్కటే. దీనికి ఎవరి ఆక్షేపణను లెక్క చేయనవసరం లేదు. ఇంక హిందువుల బహుదేవతారాధన

విషయం దేముడు ఒక్కడేనని, అతనికి రూపు రేఖలు లేవని, అతడు సర్వ వ్యాపకుడని ప్రపంచానికి మొట్టమొదటగా చాటి చెప్పినది హిందువులే. అనేక కోట్ల నామాలతో పిలువబడే దేవతలంతా సూర్యుని కాంతి కిరణములవంటి వారే తప్ప హిందూ మతం అనేకేశ్వరోపాసనను (Polytheism) బోధించదు, ఏకం సత్ విప్రాబహుధావదన్తి అన్నది ఋగ్వేద సూక్తి. ఉన్నది ఒక్కడే దేముడని, దానిని జ్ఞానులు బహుముఖాలుగా కీర్తించారని దీని అర్థం. వేదము అనగా జ్ఞానము అని అర్థం. ఈ జ్ఞానము ఎన్ని రూపాలుగా, ఎన్ని గ్రంథాలుగా వున్నప్పటికీ వాటి సారాంశమంతా ఒక్కటే గనుక హిందూ మత గ్రంధములు ఎన్ని వున్నా తప్పు లేదు. ఒక బింబమునకు ఎన్ని ప్రతిబింబాలున్నప్పటికీ ఎలా తప్పు లేదో జ్ఞానమునకు సంబంధించి ఎన్ని మత గ్రంథాలున్నా తప్పు లేదు. ఎవరికో ఒకే ఒక్క దేముడు. ఒక్కటే మత గ్రంధం వుంటే యీ ప్రపంచమంతా అలాగే వుండాలని శాసనమేమీ లేదు.

అయితే, క్రైస్తవ మిషనరీలు హిందువులను మతం మారుస్తున్నారంటే దానికి నిందించవలసింది ఎవరిని? దేశంలో ముస్లిములున్నారు, సిక్కులున్నారు. వారెవ్వరి జోలికీ వెళ్లని మిషనరీలు హిందువుల వెంటే ఎందుకు పడుతున్నారు? హిందువులకి తమ మతం పట్ల శ్రద్ధాసక్తులు లేవని, హిందూ మతాన్ని అపహాస్యం చేసినా, హిందువులను తమ మతంలోకి రావలసిందిగా ఆహ్వానిస్తూ బహిరంగోపన్యాసాలు చేసినా హిందువులెవ్వరూ ప్రతిఘటించరు గనుకనే మిషనరీలు భారతదేశాన్ని తమ ప్రధాన స్థావరంగా చేసుకున్నారు. హిందువులలోని అనైక్యత, కుల వ్యవస్థలతో బాటు ప్రభుత్వ శాసనాలు గూడా మతం మార్పిడిలకు మంచి అవకాశాలుగా లభించాయి. నిజానికి క్రైస్తవమే గనుక అంతటి గొప్ప మతమైనట్లైతే, ఏసు క్రీస్తు అంతటి మహిమ గల దేముడే అయినట్లైతే, అన్ని వ్యాపార ప్రకటనలలాగా దానికింత ప్రచారం, ప్రలోభం ఎందుకు? గాంధీజీ చెప్పినట్లుగా "రండి, నన్ను ఆఘ్రాణించండి' అని ఏ గులాబి పువ్వూ మనల్ని అభ్యర్థించదు!" హింస, అత్యాచారం, అవినీతి వంటి నేరాలకు అతీతులుగాని యీ మిషనరీలంతా మనకు ధర్మ సూత్రాలను బోధించేవారా? సామదాన బేధమాయోపాయాల ద్వారా జరిగే మతం మార్పులలో హృదయ పరివర్తనెక్కడిది? అసలు హిందూ మతం కంటె క్రైస్తవం ఏ విధంగా గొప్పది? క్రైస్తవులు గూడా అందరిలాగానే జరామరణాలు, ఆకలి దప్పులు, అనారోగ్యం, దారిద్ర్యం మొదలగు వాటితో బాధపడటం లేదా? క్రైస్తవులైనందుకు వారికి గల ప్రత్యేకత ఏమిటి? పరలోకంలో లభిస్తుందంటారా? దానికి ఋజువేమిటి? ఒక్క క్రైస్తవులకి మాత్రమే స్వర్గద్వారాలు తెరవబడినాయని చెపితే

నమ్మకమేమిటి? ఎందుకు హిందువులు తమ మతాన్ని వదలుకుని అన్యమత ప్రవేశం చేయాలి. ఎప్పుడైనా హిందువులు ఈ విషయం పై ఆత్మ విమర్శ, ఆత్మ విశ్లేషణ చేసుకున్నారా? హిందూ దేశాన్ని ఛిద్రం చేసి, హిందూ సంస్కృతిని భగ్నం చేసి హిందూ దేశాన్ని క్రైస్తవ దేశంగా మార్చే కుటిల రాజకీయ ప్రయత్నమే మతం మార్పు కార్యక్రమాలు దీనిని తెలివి తక్కువ హిందువుల గ్రహించలేకపోతున్నారు.

హిందూ మత పునరుజ్జీవానికి ముఖ్య సూత్రం మతం మార్పులను స్వచ్ఛందంగా నిషేధించడం. ఎట్టి పరిస్థితుల్లోను హిందువులు అన్యమతస్థులను వివాహమాడరాదు. ఈ వివాహం వంకతోనే మతం మార్పులు ఎక్కువగా జరుగుతున్నాయి. ప్రేమకు మతం లేదనే చిలుక పలుకులు వల్లించకండి. మనందరికీ మన రాజధాని భాగ్యనగర చరిత్ర తెలిసినదే. అంతటి ప్రేమపాదుషా సైతం రాణి భాగమతిని వివాహమాడటానికి ఆమె హైదర్ బీబీగా ఇస్లాం మతంలోకి మారవలసి వచ్చింది. ఇదేనా ప్రేమ? హిందువులు మాత్రమే తమ మతాన్ని వదులుకుని తమ ప్రేమను ఋజువు చేసుకోవాలి. ఎంతటి ఆత్మవంచన? కుల వివక్షత కారణంగా హరిజనులు కొంత మంది క్రైస్తవం పట్ల ఆకర్షితులవుతున్నారు. ఇది చాలా అవివేకం. ఈ దుస్థితి అన్యమతాల్లో లేదు. ఉదాహరణకు అమెరికాలోని తెల్లవారు అక్కడి నల్లవారిని ఎంత కించపరుస్తున్నప్పటికీ నల్లవారు తమ హక్కుల కోసం పోరాడుతారే తప్ప క్రైస్తవం విడిచి వెళ్లరు. అలాగే పాకిస్తాన్లోని అహమ్మదీయ తెగ వారిని ఇస్లాం నుంచీ బహిష్కరిస్తూ వారికి మసీదుల్లో ప్రవేశం నిషేధించినప్పటికీ అహ్మదీయులు తామింకా ముస్లింలమేనని, తమకు మసీదుల్లో ప్రవేశం కలుగజేయాలని విజ్ఞప్తి చేస్తారే తప్ప ఇస్లాం విడచి వెళ్లరు. మరి హరిజనులు మాత్రం అగ్రవర్ణాల వారి మీద కోపంతో హిందూ మతం విడచి వెళ్లడమెందుకు? ఈ మతం అగ్రవర్ణాల వారి స్వంత ఆస్థి కాదు గదా? పోనీ మతం మార్చుకున్న హరిజనులకు వెంటనే ఏమన్నా అద్భుతాలు జరిగాయా? లేదే? అవే పూరి గుడిసెలు, అదే దారిద్ర్యం, అవే జరామరణాలు. అంతా అదే జీవితం. ఒక్క మతంలో మార్పు తప్ప ఇంక ఎటువంటి మార్పు లేదు. మనలో కుహనా లౌకిక హిందువులేమంటారంటే మతం మార్చుకున్న హరిజనులంతా ఉచిత విద్య, ధన సహాయం, ఉద్యోగం వంటి వాటికి ఆకర్షితులై వెళ్లారని ఇది హిందువులు వారికి కల్పించలేకపోయారని విమర్శిస్తుంటారు. ఎంతటి ధన సహాయంతోనైనా కనీసం ఒక ముస్లిం బిచ్చగాడిని గాని ఒక క్రైస్తవ కుష్ఠు రోగిని గాని హిందూ మతంలోకి మార్చగలరేమో చూడండి. మీ వల్ల కాదు. ముస్లింలకు, క్రైస్తవులకు వారికి తమ మతం పట్ల గల విశ్వాసం హిందువులు ఆదర్శంగా తీసుకోవాలి. ఈ ప్రభుత్వం

తనకు తానుగా మతం మార్పులను నిషేధిస్తుందనే ఆశ లేదు గనుక హిందువులే స్వచ్ఛందంగా ఆ పని చేసి ధర్మ రక్షణకు కృషి చేయాలి.

# హిందువులు మతం మార్పులు ఎందుకు చేయలేరు?

రాజ్యాంగంలో కల్పించబడిన మత స్వేచ్ఛ, ప్రచార హక్కులు హిందువులకి కూడా వున్నవి గదా? క్రైస్తవ మిషనరీలు హిందువులను మతం మారుస్తుంటే హిందువులు గూడా తిరిగి అదే పని చేసి క్రైస్తవుల్ని హిందూ మతంలోకి మార్చవచ్చు గదా? క్రైస్తవులకి తమ మతం పట్ల గల శ్రద్ధ హిందువులకి లేనపుడు రాజ్యాంగాన్ని, లౌకిక తత్వాన్ని నిందించడం ఎందుకు? ఇదీ మన కుహనా లౌకికుల వాదం! నిజమే, రాజ్యాంగంలో పొందుపరచబడిన ప్రచార హక్కులు హిందువులకి కూడా వున్నవి. క్రైస్తవుల ప్రచారానికి ప్రతిగా హిందువులు గూడా ప్రచారం చేసి క్రైస్తవుల్ని హిందువులుగా మార్చటానికి ఎట్టి అభ్యంతరము లేదు. వంచనతో, కపటంతో, సేవ అనే మేలి ముసుగుతో హిందువులు గూడా మతం మార్పులు చేయించగలరు. ఈ మిషనరీలందరూ అదిరిపడేట్టుగా ఒక్క అరగంటలో మొత్తం క్రైస్తవులందర్నీ తిరిగి హిందూ మతంలోకి మార్చే సాహసం, సామర్థ్యం హిందువులకి లేకపోలేదు. కాని అట్లా చేయలేకపోవటానికి ముఖ్య కారణం హిందూ మతం వర్ణ సంకరాన్ని ఆమోదించకపోవడమే. హిందువులది ఒక స్వచ్ఛమైన, సంకరమే లేనటువంటి ఒక మౌలికమైన జాతి. వీరిలో ఎన్ని కులాల వారు, ఎన్ని శాఖల వారున్నప్పటికీ వారందరిలో శతాబ్దాల తరబడి అదే రక్తం ప్రవహిస్తూ వస్తోంది. సంకరమే లేనటువంటి హిందూ సమాజంలోకి అన్యమతస్తులను ప్రవేశింపజేసి జాతిని సంకరం చేయటానికి హిందువులెవ్వరూ అంగీకరించకపోవడం నిజంగా అన్యమతాల వారికి గొప్ప అవకాశమైంది గాని లేకపోతే ఈ దేశంలో మరొక మతం ప్రవేశించి వుండేది కాదు. వర్ణ సంకరాన్ని హిందువులు అంగీకరించని కారణంగా ఒకసారి హిందూ మతం వదలి వెళ్లిన వ్యక్తి శాశ్వతంగా దీనికి దూరమవుతున్నాడు. స్వామి వివేకానంద చెప్పినట్లుగా 'హిందూ మతం వదలి వెళ్లిన ప్రతివాని వల్లా మనకొక మనిషి తగ్గడమే కాదు, ఒక శత్రువు ఎక్కువవుతున్నాడు కూడ.' ఎంతటి నగ్న సత్యం? హిందూ మతం మతం మార్పులు ప్రోత్సహించకపోవడానికి మరొక కారణం మతాన్ని రాజకీయ ప్రయోజనాలకి వాడుకోకపోవడమే. తమ సంఖ్యా బలాన్ని వృద్ధి చేసుకుని రాజకీయ లబ్ధిని పొందాలనుకోవడాన్ని హిందూ మతం ఎన్నడూ అంగీకరించలేదు. హిందూ మతం ధర్మాన్ని బోధిస్తుంది, ప్రచారం చేస్తుంది. హిందూ

మతంలోని మంచిని, ధర్మ నైతిక సూత్రాలను పురాణ శ్రవణం, హరి కథలు, తోలుబొమ్మలు, నాటకాలు, లలిత కళల ద్వారా ప్రచారం చేస్తూనే, వీటిని ఆచరించడానికి మతం మార్పులని అవసరంగా భావించలేదు. ఒక వ్యక్తి క్రైస్తవుడుగానే, ముస్లిముగానే వుంటూ హిందూ మతంలోని మంచిని స్వీకరించాల్సిందిగా హిందూమతం అభ్యర్థిస్తుందే తప్ప, ఆ వ్యక్తిని తన మతం నుంచీ, సంఘం నుంచీ, సంస్కృతి నుంచీ దూరం కమ్మని ఆదేశించదు. ఇదే నిజమైన లౌకిక తత్వం.

# మతం మార్పుల వల్ల నష్టం?

"భగవంతుడొక్కడే, పేర్లు మాత్రమే వేరు. రాముడన్నా, రహీం అన్నా, జీససు అన్నా అన్నీ ఆ భగవంతుడికే చెందుతాయి. ఎవరు ఏ దేముడిని పూజించినా నష్టం లేదు. దాని కోసం మతాన్ని రాజకీయం చేయరాదు." ఇది మన కుహనా లౌకికుల వాదం. మతం అంటే ఏమాత్రం అవగాహన లేని ఇటువంటి వారి వల్ల ఎంత హాని జరుగుతోందో ఎవరూ గ్రహించరు. మతం అనేది కేవలం దేముడిని కొలవటమే గాదు. అది ఒక సాంఘిక శక్తి, ఒక సంస్కృతీ కేంద్రం, ఒక దేశ సమగ్రత. మతం మార్పుల వల్ల దేశంలో భిన్న మత వర్గాలేర్పడతాయి. ప్రజల్లో మత పక్షపాతం తలెత్తి శాంతిభద్రతల సమస్యలు తలెత్తుతాయి. నేడు మన దేశంలోని అత్యంత ప్రధాన సమస్య ఏమిటి? అది నిరుద్యోగమో, దారిద్ర్యమో కాదు. దేశ రక్షణ, విదేశీ దురాక్రమణలు కానే కాదు. ఆహార సమస్య, ఆకలి చావులు అంతకంటే కాదు. జాతీయ సమైక్యత. ఇదే నేటి మన ప్రధాన సమస్యయి కూచుంది. దేశంలోని భిన్న మతవర్గాల మధ్య సఖ్యత అత్యంత ప్రధాన సమస్యగా నేడు పరిణమించింది. రోజూ దూరదర్శన్, రేడియోల్లో తరచుగా వినవచ్చే సందేశాలివే. ఈ జాతీయ సమైక్యత కోసం పరుగు పందాలు, సంగీత కచేరీలు నిర్వహించే ప్రభుత్వం నేల విడిచి సాము చేస్తోంది. జాతీయ సమైక్యతకు విఘాతం కలిగించే మతం మార్పులను నిషేధించాల్సింది పోయి జాతీయ సమైక్యతను బోధిస్తూ దాని కోసం పరుగు పందాలు నిర్వహించడం రోగమొకచోట, మందొక చోట అన్నట్లుంది. ఎన్ని నినాదాలిచ్చినా, ఎన్ని సంగీత కచేరీలు నిర్వహించినా యీనాడు హింధూ ముస్లిం మైత్రి అంతంత మాత్రమే. ఇది చాలదన్నట్లు హిందువుల్ని క్రైస్తవంలోకి మార్చుతూ దేశంలో ఇంకొక తృతీయ శక్తిని తయారు చేసే మిషనరీ రాజకీయాల్ని నిషేధించకపోతే దేశం అత్యంత ప్రమాద స్థితిలో పడబోతోంది. మతం మారగానే ఎంతటి వేర్పాటువాదం తలెత్తుతుందో మన ఈశాన్య రాష్ట్రాలు చూస్తే తెలుస్తుంది. నాగాలాండు నుంచీ ఢిల్లీ

వస్తున్న నాగా తన వాళ్లతో "నేను భారత్‌కు వెడుతున్నాను" అంటాడు. కాశ్మీర్లోని ముస్లింలంతా మనల్ని హిందుస్తానీలని వ్యవహరిస్తారు. అందుకే హిందూ మతం నుంచి నిష్క్రమించదలచిన డా॥ అంబేద్కర్‌ను తమ మతంలోకి రావలసిందిగా ముస్లిం, క్రైస్తవ వర్గాలు ఆహ్వానించినపుడు ఆయనేమన్నారో తెలుసా? "నా వాళ్లు ముస్లిములైతే జాతీయతను కోల్పోతారు. క్రైస్తవులైతే ఇక్కడ బ్రిటిషు పాలన బలపడుతుంది" అన్నాడు. విదేశ మతాల వల్ల భారత వ్యతిరేకత ఏర్పడుతుందని అంబేద్కరు ఎంత నిర్మొహమాటంగా చెప్పాడో చూశారా? ఈ దేశంలో వుంటూనే ఈ దేశ సంస్కృతికి, ఈ దేశ పూర్వ వైభవానికి దూరమవుతున్నారు. మతం మార్చుకున్న వారెవరూ మన ఇతిహాసాలను, మన సంగీతాన్ని, మన శిల్పం, నాట్యం, వగైరా భారతీయ కళల్ని మెచ్చుకోరు. మతం మార్పుల వల్ల దేశంలో విదేశ సంస్కృతి చోటు చేసుకుంటోంది.

# కుల వ్యవస్థ

ప్రపంచంలో ఎక్కడా లేని పెద్ద సాంఘిక వ్యవస్థ మన దేశంలో వున్నది. అదే కుల వ్యవస్థ (Caste System). బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు మరియు శూద్రులు అనే చాతుర్వర్ణ వ్యవస్థ భారతీయ సాంఘిక జీవనంలో ఎంతటి అంతర్భాగమైందో అంతటి వివాదగ్రస్తమైంది కూడా. బ్రాహ్మణులకు శర్మ, క్షత్రియులకు వర్మ, వైశ్యులకు గుప్త మరియు శూద్రులకు దాసయని నామాంతములు గలిగిన హైందవ సమాజంలో కుల వివక్షత చోటు చేసుకుని మతానికి మాయని మచ్చను తెచ్చి పెట్టింది. శాస్త్రాలలో ఒక్కొక్క వర్ణానికి ఒక్కొకక్క వృత్తిని ధర్మాన్ని గురించి మాత్రమే చెప్పారు గానీ ఎక్కడా బ్రాహ్మణుడు మంచివాడు శూద్రుడు చెడ్డవాడు అని గాని, ఏ వృత్తి గాని ఇతర వృత్తుల కంటె ఎక్కువని గాని తక్కువని గాని చెప్పలేదు. స్పష్టమైన మంత్రోచ్చారణ కలిగి, శాస్త్రోక్తంగా కర్మకాండలను నిర్వర్తించే ఒక సద్బ్రాహ్మణుడెంతటి హిందువో, మంచి చెప్పుల జతనొకటి చేసి ఇవ్వగల హరిజన చర్మకారుడు కూడా అంతే ఉత్తమ హిందువు. శరీర అశరీరమయములన్నీ ఈశ్వర ప్రతిరూపాలేనని ఉపనిషత్తులు ఘోషిస్తున్నా గానీ హైందవ సమాజంలోని కొన్ని స్వార్థపరశక్తుల వలన క్రమంగా వర్ణ వివక్షత, అంటరానితనం ప్రవేశించినది. నాటి చాతుర్వర్ణ వ్యవస్థకు బదులు నేడు వేలాది ఉపకులాలు ఏర్పడి హిందూ సమాజంలో కుల ప్రాతిపదికపై శాశ్వతమైన అడ్డు గోడలు నిలిచాయి. కుల నిర్మూలనకై ఫలితం లేని ప్రయోగాలు ఎన్నో జరిగి భారతదేశం ఒక పెద్ద ప్రయోగ శాలగా మారింది.

అయితే, హిందూ సమాజంలోనున్న కుల వ్యవస్థ ప్రపంచంలో మరెక్కడా లేదనడం ఒక్క హిందూ మతంలో తప్ప విగ్రహారాధన మరే మతంలోనూ లేదనడం లాగా వున్నది. విగ్రహం భగవంతుని రూపానికి ప్రతీక అయినట్లే, ఒక ముస్లింకి మసీదు ఒక క్రైస్తవునికి చర్చి భగవంతుని ప్రతీకలు. నిరాకారుడైన దేమునికి రూపం కల్పించి విగ్రహాలను పూజించడం అవివేకమైతే సర్వవ్యాపకుడైన భగవంతునికి ఒక స్థానం కల్పించి ఒక మసీదులోనో ఒక చర్చిలోనో ప్రార్థనలు జరపడం మాత్రం అవివేకం కాదా? ఇకపోతే, హిందూ సమాజంలో కుల వ్యవస్థ వున్నట్లే అమెరికన్ సమాజంలో వర్ణ వ్యవస్థ నీగ్రోలు తెల్లవారు అనే వ్యవస్థగా, యూరోపియన్ దేశాల్లో శ్రామికులు, ధనికులు అనే వ్యవస్థగా, ముస్లిం మతస్తుల్లో షియా, సున్నీలుగా, క్రైస్తవుల్లో కాథలిక్కులు, ప్రొటెస్టంట్లుగా ఇలా ఏదో ఒక రూపేణా వివక్షత వుంది. మనుష్యులు విభజింపబడటానికి కారణం కేవలం కులమే కానక్కర్లేదు. రంగు, ప్రాంతీయత, భాష, ఆర్థిక హోదా, మతం, శాఖ వగైరా ఎన్నో కారణాలుగా మానవ సమాజం విభజనకు గురికాబడుతోంది. కనుక కులాన్ని నిర్మూలించాలనడం కంటే కుల వివక్షతా భావాన్ని నిర్మూలించాలనడం సబబు. ఒకవేళ బలవంతంగా మనం కులాన్ని నిర్మూలించినా వివక్షతా భావం పోనట్లైతే కులం స్థానంలో మరొకటేదో వచ్చి కూచుంటుంది. ఎందుకంటే కులరహిత సమాజాలైన ఇస్లాం క్రైస్తవ వర్గాల్లో శాఖాబేధాలు చోటు చేసుకోలేదా?

హిందూ సమాజంలో నేటి కుల వ్యవస్థ పై హేతువాదులు, క్రైస్తవ మిషనరీలు అనవసరమైన మొసలికన్నీరు కారుస్తున్నారే గాని చరిత్రలో ఎన్నడూ కులపరమైన యుద్ధాలు జరుగలేదు. బ్రాహ్మణులు ఎన్నడూ రాజ్యాధికారాన్ని కోరలేదు. క్షత్రియులు ఎన్నడూ బ్రాహ్మణుల మంత్రిత్వాన్ని ప్రశ్నించలేదు. వైశ్యులు, శూద్రులు ఎన్నడూ తమ వృత్తులలో అవాంఛనీయ పోటీలనెదుర్కొనలేదు. ఒకరి హక్కులనొకరు భుక్తం చేయని కుల వ్యవస్థ హిందూ సమాజంలో నాడు సత్ఫలితాలనే ఇచ్చింది. కనుక మానవకల్పితాలైన కుల వివక్షత, అంటరానితనాన్ని మతానికి ఆపాదించడం మహాపరాధం. మానవ దేహంలో ఏ అవయవం ముఖ్యం, దేనికంటె ఏది ఎక్కువ అంటే ఏం చెప్పగలం? ఒక దేవాలయ రథోత్సవానికి ఎవరు పిన్నలు, ఎవరు పెద్దలు? దైవ సన్నిధిలో మంత్రోచ్చారణ గావించే పురోహితుడా? ఆలయ నిర్వాహకులైన ధర్మకర్తలా? రథాన్ని తాడుతో లాగుతున్న భక్తజనమా? కంచు కాగడాలతో ముందుకు నడిచిపోయే దివిటీ వాడా? ఇందులో ఎవరు ముఖ్యులంటే ఏం చెప్పగలం? హిందూ మతమంటే బ్రాహ్మణీకం కాదు, ఈ మతం అగ్రవర్ణాల వారి స్వంత ఆస్తి అంతకంటే కాదు. బ్రాహ్మణులు హైందవ ధర్మానికి

భారతీయ ఆధ్యాత్మిక సంపత్తికి ఎంత మేలు చేశారో, హిందూ సాంఘిక వ్యవస్థకు అంత హాని గూడా చేశారు. వేద విజ్ఞాన రహస్యాలను వెలికితీసి విజ్ఞానశాస్త్రం, వేదాంతం, లలితకళలు వంటి విషయాలను అధ్యయనం చేసి ప్రపంచ మానవాళి పురోగతికి కృషి చేసిన సద్బ్రాహ్మణుల వల్ల ఈ మతం ఎంత పునీతమైందో, అంటరానితనాన్ని, కుల వివక్షతను సమాజంలో ప్రవేశింపజేసి హిందూ సమాజాన్ని కుల ప్రాతిపదికపై విడగొట్టిన క్షుద్రబ్రాహ్మణుల వల్ల గూడా మతం అంత భ్రష్టమైంది. అయితే నేటి కులతత్వానికి హిందూ సమాజంలో బ్రాహ్మణాధిపత్యమే కారణమనే వాదన గూడా సమంజసం కాదు. బ్రాహ్మణత్వమే హిందూ మతం అని భావించినట్లైతే, బ్రాహ్మణులే హిందూ మత శాసనకారులనుకుంటే, ఐహిక భోగముల నాశించక కేవలం కర్మిష్ఠిగానే జీవించవలసిన అవసరం బ్రాహ్మణులకేమొచ్చింది? ఈ కుల వ్యవస్థను బ్రాహ్మణులే గనుక కల్పించి వుండి వుంటే, భోగలాలసతకు, రాజ్యాధికారమునకు, దండనాధికారములకు తమను కాదని క్షత్రియులనేల నిర్ణయించారు? సంపదలతో తులతూగుతూ, పట్టు పరుపులు, మత్తు పానీయములు, ఇంద్రియ భోగములు, దాసదాసీ జనము ఇటువంటి రాచరికపు జీవితము వద్దని, జానెడు గుడ్డతో, కౌపీన వస్త్రధారులై, తెల్లవారుఝాము చలిలో, చన్నీళ్ల స్నానములతో, సాత్వికాహారములతో, ఏక భుక్తములతో, వైదిక కర్మలను అనుష్ఠించుతూ, ఐహిక భోగములకు దూరముగా దరిద్ర నారాయణుల వలె జీవితము గడుపు అవసరము బ్రాహ్మణులకేమి వచ్చినది? వారు కావాలనుకుంటే, వర్ణ వ్యవస్థను వారే సృష్టించివుంటే, సంపద, అధికారము, ఐహిక భోగములు లేని వృత్తినే ఎంచుకున్నారేమి? ఇది అసమంజసంగా లేదా?

హిందూ బంధువులారా! వివిధ కులాల మధ్య చిచ్చును రగిల్చి హిందువుల అనైక్యతకు దోహదం చేసే క్షుద్ర రాజకీయ శక్తుల పట్ల అప్రమత్తులై వుండండి. నేటి తెలివితక్కువ, అవకాశ రాజకీయముల ఫలితంగా, బ్రాహ్మణులు అందరికీ శత్రువులైనారు. హరిజనులు హిందూ మతం నుంచి వేరు చేయబడుతున్నారు. హరిజన క్రైస్తవులు హరిజనులుగా చలామణి అవుతున్నారు. ఇన్ని శతాబ్దాలుగా లేని కుల విద్వేషాలు నేడు తలెత్తుతున్నాయి.

# కుల నిర్మూలన పథకమే మత నిర్మూలన పథకం

**ఇం**గ్లీషు భాషలో ఒక సామెత వుంది. కుక్కను చంపే ముందు దానికొక చెడ్డ పేరిచ్చి చంపమని (To kill a dog give it a bad name and then kill it). హిందూ మతం పై బురద చల్లటానికి, హిందువులకి తమ మతం పట్ల విరక్తిని కలుగజేయటానికి, హిందువుల్ని మతం మార్పిడి చేయటానికి అత్యుత్తమ ప్రచార సాధనం కులవ్యవస్థ. కుల

వ్యవస్థనే పరిశోధనాంశంగా తీసుకుని, డాక్టరేటు పట్టా పొందిన డా॥ భీమరావు అంబేద్కరు కులాన్ని నిర్మూలించాలంటే దానినాధారం చేసుకుని వున్న మతాన్ని గూడా నిర్మూలించక తప్పదంటాడు. 1936వ సంవత్సరంలో లాహోరు నగరంలో జరగవలసి వున్న ఒక సభా కార్యక్రమం కోసం తాను వ్రాసిన ప్రసంగపు వ్యాసం, కారణాంతరాల వల్ల ఆ సభ జరగనందున ఆయన దానిని తరువాత ముద్రించారు. అందులో ఆయనిలా అంటారు-

హిందువులు తమ సామాజిక వ్యవస్థను పరమ పవిత్రంగా భావిస్తారు. కులానికి దైవిక ప్రతిపాదనను ఆపాదిస్తారు. అందువల్ల మీకు కులాన్ని నిర్మూలించాలంటే దానినాధారం చేసుకుని వున్న దైవికతను, పవిత్రతను ముందు నిర్మూలించవలసి వుంది. అంటే, శాస్త్రాల యొక్క, వేదాల యొక్క అధికారాన్ని నిర్మూలించవలసి వుందన్నమాట."

**- డా॥ బి.ఆర్. అంబేద్కరు - "కుల నిర్మూలన"**

డా॥ అంబేద్కరు మాట ప్రకారం, కులరహిత సమాజం కోసం హిందువులు తమ మతాన్ని వదలుకోవాలి. అప్పుడు ఇన్ని కోట్ల మంది హిందువులు ఒక్కసారిగా మతరహితులుగా, ఏమతానికీ చెందని వారిగా వుండిపోతారు. అయిదు వేల సంవత్సరాల హైందవ నాగరికత, సంస్కృతి ఒక్కసారిగా అంతరించిపోతాయి. సరే... తర్వాత ఏం చేయాలి? హిందువులు అలాగే ఎప్పటికీ మతరహితులుగా వుండిపోవాలా? మరి డా॥ అంబేద్కరు కుల నిర్మూలనకై హిందూ మతాన్ని వదలి నాస్తికుడిగానే వుండిపోక మళ్లీ బౌద్ధ మతం స్వీకరించాడే? అంటే, మనిషికి ఏదో ఒక మతం అవసరమా? రేపు హిందువులు గూడా కుల నిర్మూలన పథకంలో హిందూ మతం వదలి వచ్చిన తర్వాత మరేదో మతం స్వీకరించాలా? హిందువుల సామూహిక మతం మార్పులకు మార్గం సుగమం చేయడమేనా యీ కుల నిర్మూలనా పథకాలు? మతం మార్పు నాటకాలకు రంగస్థలాలుగా పని చేస్తున్నాయా కుల నిర్మూలనా పథకాలు?

నేడు మనం ఇరవై ఒకటవ శతాబ్దంలో వున్నాం. ఇప్పుడు కులం అనేది నామమాత్రమే. ఎవరూ తమ కుల ధర్మాన్ని పాటించటం లేదు. కుల వివక్షతను ప్రోత్సహించటం లేదు. తిరుపతి, కాశీ, రామేశ్వరం వంటి ప్రముఖ దేవాలయాల్లో గానీ, హోటళ్లల్లో, ప్రభుత్వ, ప్రైవేటు కార్యాలయాల్లో గాని ఎక్కడా యీ కుల ప్రభావం కనపడదు. ఒక్క వివాహ విషయాల్లో మాత్రం దీని ప్రభావం కనపడినా, అది అగ్రవర్ణాల వారి మధ్య గూడా శాఖాబేధం కలిగి వున్నది. నేటి వరకట్నం, వితంతు వివాహం వంటి సాంఘిక దురాచారం వలెనే యీ కుల వివక్షత గూడా ఏనాటికైనా నశించి తీరుతుంది. దీని కారణంగా హిందూమతాన్ని కించపరచటం అవివేకం. కుల వ్యవస్థ హిందూ సమాజానికి

అనర్థదాయకమే అయితే, ఇది హిందూ మతానికి నిజంగా అపశృతే అయితే, యీ కులము, మతము, రెండూ ఏనాడో అంతరించిపోయి వుండేవి. మానవ కల్పితాలైన వ్యవస్థలు, ప్రజలకు అంగీకారం కానివి, ప్రగతికి అవరోధకరమైనవెన్నో చరిత్రలో అంతరించిపోయినవి. ఇన్ని కులాలు గలిగిన హిందూ సమాజం నిజానికి అంతర్యుద్ధాలతో ఏనాడో కులపరంగా ముక్కముక్కలుగా, అనేక స్వతంత్ర రాజ్యాలుగా చీలిపోయి వుండవలసింది. కాని నేడు మనకి తెలిసిన కుల వ్యవస్థ కాక మరేదో మహత్తరమైన వ్యవస్థ ఆనాడు వుండబట్టి నేటికీ హిందూ సమాజం చెక్కు చెదరకుండా నిలిచివుంది. ఈ సందర్భంగా డా॥ రాధాకృష్ణన్ పండితుని అభిప్రాయం చూడండి -

"చరిత్రకు తెలిసిన కాలం నుంచీ కూడా అనేక జాతులకు, సంస్కృతులకు చెందిన ప్రజలు ఇండియాలోకి తోసుకువస్తున్నప్పటికీ హిందూ మతం తన ఆధిక్యతను నిలుపుకోగలిగింది. అంతేగాక అన్యమత ప్రచారకులు రాజాదరణతోను, అధికార బలంతోను విజృంభించినప్పటికీ, హిందువుల్లో అధిక భాగం తమ మతంలోకి మార్చుకోలేకపోయారు. బహుశః ఇతర మతాలకు, మత భావాలకు లేని జీవ శక్తి ఏదో హిందూ సంస్కృతికి వున్నదనవచ్చు. బ్రతికి వున్న చెట్టులో రసప్రసరణ జరుగుతున్నదో లేదో తెలుసుకోవటానికి ఆ చెట్టును కొట్టి చూడవలసిన అవసరం ఎలా లేదో, హిందూ మతంలో అమృతశక్తి వున్నదో లేదో కనుక్కోడానికి దానిని మధించి చూడవలసిన అవసరం కూడా లేదు."

- డా॥ రాధా కృష్ణన్ (హిందూ వ్యూ ఆఫ్ లైఫ్)

హిందూ మతం శాస్త్రీయమైనదో కాదో, ఇతర మతాల్లో లేని మహత్తర శక్తి ఈ మతానికి వున్నదో లేదో కాలమే నిర్ణయిస్తుంది. కాల పరీక్షకు నిలవలేని నాగరికతలు, భాషలు, వ్యవస్థలు ఎన్నో చరిత్రలో గతించిపోయినవి. హిందూ మత నిమ్నోన్నతాలను నిర్ణయించేది గూడా కాలమొక్కటే.

# నకిలీ హరిజనులు

హిందూ సమాజంలోని కుల వివక్షత కారణంగా మన కనిష్ఠ సోదరులైన హరిజనులు ఎంతో అన్యాయానికి గురైనారు. నిజానికి రాజ్యాంగంలో ఎక్కడా 'హరిజన' అన్న పదం లేదు. శ్రీ నరసింహ మెహతా అనే వ్యక్తి సూచించిన యీ పదాన్ని గాంధీజీ స్వీకరించి అప్పటి దాకా అంత్యజులు అని పిలువబడే వారికి 'హరిజన' అని నామకరణం

చేశారు. నూటికి నూరు పాళ్లు హిందువులైన హరిజనులను తోటి హిందువులే వక్రబుద్ధితో శారీరకంగా, మానసికంగా ఎంతో బాధలకు గురి చేశారు. నిజానికి పిపీలికాది బ్రహ్మపర్యంతం ఈశ్వరమయమని బోధించే హిందూమతం యీ కుల వివక్షతని ఎన్నడూ సమర్థించకపోయినా, అగ్రవర్ణాలలోని కొన్ని దుష్ట శక్తులు వర్ణ వివక్షతకు మతం యొక్క రంగు పులిమి హిందూ మతానికి, సంస్కృతికి ఎనలేని హాని చేశారు. దీనిని ప్రతిఘటిస్తూ, డా॥ భీమరావ్ అంబేద్కర్, గాంధీజీ వంటి వ్యక్తులు, మరెన్నో సాంఘిక సంస్థలు పోరాడినప్పటికీ హరిజనుల సాంఘిక స్థితిని కొంతవరకు మార్చగలిగినా, వారి ఆర్థిక స్థితి మాత్రం మార్చలేకపోయారు. దేశ స్వాతంత్ర్యానంతరం, మన రాజ్యాగ నిర్మాతలు హరిజనులు అనుభవించిన చిత్రహింసలకు పరిహారంగా వారికి రాజ్యాంగంలో కొన్ని రక్షణలు, రాయితీలు కల్పించారు. విద్య, ఉపాధి, ఉద్యోగం, పదోన్నతి వంటి విషయాలలో హరిజనులకు కొన్ని ప్రత్యేక హక్కులు, రక్షణలు కల్పించారు. ఇవన్నీ కాల పరిమితికి లోబడినవే అయినప్పటికీ వాటిని కావలసినంత కాలం పొడిగించుకునే వీలు కూడా కల్పించారు. ఇది ఎంతో ముదావహం. హరిజన అన్న పదం కేవలం హిందువులకు మాత్రమే వర్తిస్తుంది గనుక రాజ్యాంగంలోని 15 మరియు 16వ అధికరణం క్రింద కల్పించబడిన రక్షణలకు ఇతరులందరూ అనర్హులు. ఎందుకంటే, కులం అనే వ్యవస్థ మరే మతంలోనూ లేదు గనుక, ప్రభుత్వం ప్రకటించిన కులాలు హిందూ సమాజంలోనివే గనుక రక్షణలు కల్పించబడిన వారంతా నూటికి నూరు పాళ్లు హిందువులేనని వేరే చెప్పనక్కరలేదు. కాని నేడు వాస్తవానికి జరుగుతున్నదేమిటి? హరిజనుల పేరుతో క్రైస్తవులు యధేచ్ఛగా యీ రాయితీలను అనుభవిస్తుంటే ప్రభుత్వం, ప్రజలతో బాటు హరిజనులు గూడా ఉదాసీనత వ్యవహరిస్తున్నారు! వెనుకటి తరాలలో వీరంతా నిజమైన హరిజనులైనప్పటికీ, కాలక్రమేణా క్రైస్తవ మతం స్వీకరించిన వీరంతా హరిజనులెలా అవుతారు? రాజ్యాంగ నిబంధనల కింద రక్షణలకెలా అర్హులవుతారు? ఫిలిప్స్, జాన్, మోసెస్, ఏసుపాదం, దైవ సహాయం, మరియమ్మ, కృపమ్మ వగైరాల పేర్లు గల వీరంతా క్రైస్తవులని స్పష్టంగా తెలుస్తున్నా, వీరందరికీ హరిజనుల పేరుతో కుల ధృవీకరణ పత్రాలెలా వస్తున్నాయి? ప్రభుత్వాధికారులు వీటిని గుడ్డిగా ఎందుకు ఆమోదిస్తున్నారు? హరిజనులు దీనిని ఎందుకు ప్రతిఘటించరు? ఇదే విధంగా ఒక చౌదరి, రెడ్డి, శర్మ, శాస్త్రి, మహమూద్, సయ్యద్ అనే పేర్లు గల వ్యక్తులు తాము గూడా హరిజనులమని రాయితీల కోసం అభ్యర్థిస్తే ప్రభుత్వం నమ్ముతుందా? రెడ్డి, శర్మ, మహమూద్ పేర్లను బట్టి వారు హరిజనులు కారని నిరాకరిస్తుంది. కాని క్రైస్తవ పేర్లు స్పష్టంగా కనపడుతున్నప్పటికీ ఫిలిప్స్, జాన్,

మోసెస్ వగైరా పేర్లున్నవారు తాము హరిజనులమని ప్రకటిస్తే ప్రభుత్వం గుడ్డిగా ఆమోదిస్తోంది. ఇది రాజ్యాంగ విరుద్ధం కాదా? హరిజనుల హక్కులను భక్షుం చేస్తున్న యీ నకిలీ హరిజనుల పట్ల ఎందుకీ ఉదాసీనత? 'హరిజనులవలెనే క్రైస్తవ హరిజనులు గూడా బీదవారే కదా? వారు గూడా హరిజనుల వలె రాజ్యాంగ రక్షణలను పొందితే తప్పేమిటి? మతం మారినా వారి స్థితిగతులు, దారిద్ర్యం పోలేదు కదా? ఎందుకీ మతపరమైన వివక్షత' అని వాదించే లౌకికవాదులు లేకపోలేదు. అసలు యీ నకిలీ హరిజనులను 'క్రైస్తవ హరిజనులు' అనటమే పెద్ద తప్పు. 'క్రైస్తవ హిందువులు' అంటే ఎంత అసందర్భమో, క్రైస్తవ హరిజనులు అంటే గూడా అంతే అనర్థం. ఒక వ్యక్తి క్రైస్తవుడో లేక హిందువో కాగలడు తప్ప రెండూ కలిసి క్రైస్తవ హిందువు కాలేడు కదా? ఇంక నకిలీ హరిజనులు గూడా బీదవారే కదా అన్న దానికి సమాధనం. బీదవారు ఏ కులంలో, ఏ మతంలో లేరు గనుక? బ్రాహ్మణులు, రెడ్డి, కమ్మ, కాపు, క్రైస్తవులు, ముస్లిములు, సిక్కులు అందరిలోనూ ఎంతో కొంత శాతం బీదవారు, కటిక బీదవారూ వున్నారు. హరిజనేతరులైన 'క్రైస్తవ హరిజనుల'కి బీదరికం కారణంగా రాయితీలు ఇవ్వడం రాజ్యాంగబద్ధమేననుకుంటే అన్ని కులాలు, అన్ని మతాలలోని బీదవారందరికీ ఇవ్వమనండి. వెనుకటి తరాలలో వీరంతా హరిజనులు అయినంత మాత్రాన క్రైస్తవ మతం స్వీకరించిన తరువాత తూడా తామింకా హరిజనులేనా? క్రైస్తవ మతం స్వీకరించిన మరు క్షణమే తమకు స్వర్గ ద్వారాలు తెరుచుకుంటాయని, తమ జీవితం పూల బాటలా మారిపోతోందని భావించి మతం మార్చుకున్న వీరందరకూ ఇంకా ప్రభుత్వ రాయితీలు, రక్షణలు ఎందుకు? మతం మారగానే పటాపంచలౌతుందనుకున్న తమ దారిద్ర్యం, నిరుద్యోగం ఇంకా అలానే వుండేటట్లైతే మరి మతం ఎందుకు మార్చుకున్నట్లు? అయినా గాని యీ 'క్రైస్తవ హరిజనుల'కు సహాయ పడేందుకు అనేక దేశ విదేశ మిషనరీలు ఎన్నో వున్నవి. కాని మన హరిజన సోదరులకు ఒక్క ప్రభుత్వం తప్ప తోటి హిందువులు గూడా చేయూతనివ్వరు! ఇటువంటి బక్కచిక్కిన, అణగారిన, దరిద్ర నారాయణులకు ప్రభుత్వం చేసే యీ కాస్త ఉడతాభక్తి సాయం కూడా గ్రద్దలా తన్నుకుపోయే నకిలీ హరిజనులను పట్టి ప్రభుత్వానికి అప్పగించలసిన బాధ్యత హరిజనులపైనే ఎక్కువగా వుంది.

సరే.... ప్రస్తుతం మన చర్చా విషయం హిందూ ధర్మ రక్షణ. దానికీ యీ నకిలీ హరిజనుల సమస్యకీ ఏం సంబంధం? ఒకవేళ యీ నకిలీ హరిజనులు అధర్మంగా, రాజ్యాంగవిరుద్ధంగా రాయితీలను పొందుతున్నప్పటికీ అది హరిజనులకి అభ్యంతరం లేదనే అనుకుందాం. దీని వల్ల నష్టపోయేది హరిజనులే గనుక యీ సమస్యని హరిజనుల

ఇష్టాయిష్టాలకే మనం వదలివేయవచ్చు. కాని దీనితో హిందూ ధర్మ రక్షణ విషయం గూడా ముడి పడి వుంది! ఎందుకంటే, హరిజనుల పేరుతో యీ నకిలీ హరిజనులు రాజ్యాంగ హోదాలో రాజకీయ నాయకులుగా, ప్రభుత్వ అధికార్లు, అనధికార్లుగా వచ్చినపుడు వారి చేతిలో హిందూ ధర్మం ఎటువంటి ఆదరణకు గురి అవుతుంది? ఈ నకిలీ హరిజనులు ఎంతటి హిందూ మత వ్యతిరేకులో చెప్పడానికి ఒక చిన్న ఉదాహరణ చాలు. గతంలో ఒకసారి హైదరాబాదు నగరంలో డా॥ అంబేద్కరు జయంతి సందర్భంగా ముఖ్యమంత్రి సమక్షంలో ఒక సభ జరుగుతుండగా డా॥ అంబేద్కరు చిత్రపటానికి తిలకం దిద్దినందుకు సభికులు ఆగ్రహించి డా॥ అంబేద్కరు హిందువు కాడు గనుక ఆయన చిత్రపటానికి తిలకం బొట్టు వుండటానికి వీలు లేదని వాదించడంతో గత్యంతరం లేక సభా నిర్వాహకులు చిత్రపటానికి గల తిలకం నిర్మూలించారు. డా॥ అంబేద్కరు హిందువు కాకపోయినా సభికులంతా నిజమైన హరిజనులైతే దానికి ఎందుకంత అభ్యంతరం? మన దేశానికి వచ్చే ఎంతటి విదేశ ప్రముఖులకైనా మనం తిలకం దిద్ది, హారతి ఇచ్చి పూలమాలతో సత్కరిస్తాం. ఆ వచ్చిన వారు క్రైస్తవులైనప్పటికీ వారెవ్వరూ అభ్యంతరం చెప్పరే? ఎందుకంటే, సత్కరింపబడేవారెవరైనప్పటికీ సత్కరించేవారి సాంప్రదాయాన్ని బట్టే జరుగుతుంది కదా సన్మానం? ఎంతటి ఉన్నత శ్రేణి మంత్రులైనా, ప్రభుత్వపు అధికార్లైనా, గిరిజనులను సందర్శించినపుడు గిరిజనుల సాంప్రదాయం ప్రకారం వారి వేషధారణను అనుకరించటం లేదా? హరిజనుల్లో అంతర్లీనంగా కలిసిపోయిన యీ నకిలీ హరిజనుల హైందవ వ్యతిరేకత వల్ల హరిజనులందరూ హిందూ వ్యతిరేకులుగా ముద్ర పడుతున్నారు. ఇంక ఈ నకిలీ హరిజనులు రేపు అధికారంలోకి వస్తే పరిపాలన ఏ విధంగా వుంటుంది? రేడియో, దూరదర్శన్‌లలో వీరు అధికారులుగా వస్తే ఎటువంటి కార్యక్రమాలు ప్రసారమవుతాయి? విద్యాధికారులుగా వస్తే ఎటువంటి పాఠ్యాంశాలు చోటు చేసుకుంటాయి? పోలీసు, పరిపాలనా విభాగం వంటి శాఖల్లో యీ నకిలీలు ప్రవేశిస్తే ఎంతటి హైందవ వ్యతిరేకత బహిర్గతమవుతుంది? ఇదంతా పరోక్షంగా మన మతంపై పడదా? గతంలో ఒకసారి హైదరాబాదు నగరంలో క్రైస్తవ పాఠశాలాధికారులు తమ పాఠశాలలోని హిందూ విద్యార్థినులను బొట్టు, గాజులు, పూలు ధరించరాదని శాసిస్తే ప్రభుత్వం, ప్రజలు ఏమీ చేయలేకపోయారు. అధికారంలో లేనప్పుడే క్రైస్తవుల దురుసు తనం యీ విధంగా వుంటే రేపు హరిజనుల పేరుతో అధికారం హస్తగతం చేసుకున్న నకిలీ హరిజనులైన 'క్రైస్తవుల' చేతుల్లో హిందూ మతం ఎంతటి విపత్తులో పడబోతోంది? ఇదంతా గూడా ధర్మరక్షణకు సంబంధించిన విషయమే గదా? నకిలీ హరిజనుల వల్ల ఒక్క ప్రభుత్వ రాయితీల విషయమేగాక ఆర్థిక, రాజకీయ, ధార్మిక రంగాలలో గూడా

తీవ్ర అనుచిత పరిణామాలు రాబోతున్నాయి. వీటిని ఆదిలోనే తుంచివేయడం ప్రతి హిందువు కర్తవ్యం.

# సినిమాలు, పత్రికలు

హిందూ మత పతనానికి మరొక ముఖ్య కారణం సినిమాలు, పత్రికలు. నిజానికి ఈ రెండూ అత్యంత శక్తివంతమైన ప్రచార సాధనాలు. వీటిని సక్రమంగా ఉపయోగించకపోతే దుష్పరిణామాలకు దారి తీస్తుంది. నేటి మన సినిమాల్ని చూస్తుంటే అసలు శాస్త్రజ్ఞులీ సినిమా ప్రొజెక్టర్‌ని ఎందుకు కనిపెట్టారా అనిపిస్తుంది. మన సినిమాలు ఒక విద్యార్థిని కష్టపడి చదువుకోమని చెప్పవు. ఒక కార్మికుడిని కష్టపడి పని చేసి ఉత్పత్తిని పెంచమని చెప్పవు. విద్యార్థుల్లో ఆకతాయి తనం, కార్మికుల్లో తిరుగుబాటు తనం ఇవే హీరో లక్షణాలు! సినిమా కథలన్నీ వడబోసి చూస్తే ఒక్కటే నీతి సూత్రం. ప్రేమించి పెళ్లి చేసుకో, ఎవరికీ తల వంచకు. ఈ గొప్ప నీతి సూత్రాన్ని బోధించడానికి కోట్లాది రూపాయల ఖర్చు!

సరే.... సినిమాలు నీతి పుస్తకాలు కావాలని ఎవరూ ఆశించరు గాని చెడుని బోధించకుండా వుంటే అంతే చాలు. నేడు మన సినిమా వారికి కథలు కరువై మన పురాణాల మీద పడ్డారు. అంటే వీరు మన పురాణ గాథలను తెరకెక్కిస్తున్నారని కాదు. వాటిని ఆధునీకరణం చేసి అపహాస్యం చేస్తున్నారు. కలియుగ సీత, కలియుగ రాధ అంటూ పురాణ పాత్రలను ఆధునీకం చేస్తూ, అపహాస్యంగావిస్తున్నారు. సినిమాల్లో మన దేవతలు ఇంగ్లీషు భాష మాట్లాడ్డం, మోటారు సైకిళ్లు నడపడం, కాఫీ హోటళ్లు సందర్శించడం మన సినిమా వారి హిందూ మత సేవ! త్యాగరాజ కీర్తనలను ఆధునిక బాణీలలో వినిపించడం, భరతనాట్యం, కూచిపూడి నృత్యాలకు, పాశ్చాత్య ఆధునిక స్టెప్పులు జోడించడం సినిమా వారి కళా సేవ. మన సినిమాల్లో పాత్రలకు కష్టాలు సంభవించినపుడు వారు చేసే దైవ దూషణ, విగ్రహాలను పగల గొట్టడం, స్మృతులను, పురాణాలను దుమ్మెత్తిపోయడం మన సినిమావారి సాంఘిక న్యాయం. మన సినిమాల్లో షావుకార్లు, మార్వాడీ సేట్లు ఎప్పుడూ హీరోలకు అప్పులిచ్చి వారిని కష్టాల పాలు చేసి జలగల్లాగా వారి దగ్గర నుంచీ వడ్డీలు గుంజే దుష్ట పాత్రల్లో దర్శనమిస్తాయి. దీనికి విరుద్ధంగా కాబూలీ ఖాన్ పాత్రలు హీరోలకు ఋణ సహాయమందించే మంచి పాత్రల్లో దర్శనమిస్తాయి. నిజానికి కాబూలీవాలాలు తమ మత సిద్ధాంతములకు వ్యతిరేకంగా వడ్డీ వ్యాపారం చేస్తూ,

ఋణాల వసూళ్ల విషయంలో ఎంతో క్రూరంగా వ్యవహరిస్తున్నప్పటికీ మన సినిమా వారి దృష్టిలోనే గాక నక్సలైట్ల దృష్టిలో గూడా వారు చాలా మంచివారు! హిందూ శ్రీమంతులు, హిందూ వ్యాపారస్తులు, హిందూ పూజారులు, వీరే అందరికీ దుష్ట పాత్రలు. కేవలం హిందువులను, హిందూ దేవతలను మాత్రం అపహాస్యం చేస్తూ సినిమాలు తీసే మన దర్శక నిర్మాతలు అన్యమతాల జోలికి పోలేరన్నది జగమెరిగిన సత్యం. జాతీయ సమైక్యత ఇతివృత్తంగా సినిమాలు తీయదలిస్తే అందులో నాయకుడెప్పుడూ ముస్లిం మతస్థుడై వుండాలి. అట్లా గాక నాయకుడు హిందువు, నాయిక ముస్లింగనుకైనట్లైతే అది ఇస్లాం మతాచారానికి విరుద్ధం గనుక మన నిర్మాతలెవరూ అంత ధైర్యం చేయరు. చేసినట్లైతే ఆ నిర్మాతకు 'బొంబాయి' సినిమాకు పట్టిన గతే పడుతుంది! ఛత్రపతి శివాజీ కథను సినిమా తీయాలని సంకల్పించిన ప్రముఖ తెలుగు నటుడు ఆ సంకల్పాన్ని విరమించుకుంటూ, దానికి తగిన కారణాలను వివరించాడు. ప్రస్తుత పరిస్థితుల్లో ఆ సినిమా శాంతి భద్రతల సమస్యను సృష్టించవచ్చుననే అనుమానంతో తానా సినిమా నిర్మించలేకపోతున్నామని ప్రకటించాడు. ఇది ఎంతటి దురదృష్టమో చూడండి! మన చరిత్రను మనం యధాతథంగా తెలుసుకోలేక, వాస్తవ సంఘటనలు ఎంత చేదుగా వున్నా, వాటిని మనం తెలుసుకోలేకపోవటం ఎంతటి దుస్థితి? ఔరంగజేబు గొప్ప మతదురహంకారి, పరమతద్వేషి అన్నది చరిత్ర సత్యం. ఔరంగజేబులోని మతత్వాన్ని, హైందవ ద్వేషాన్ని హిందువులతో పాటు ముస్లింలు గూడా ఖండించవలసింది పోయి ఇది ముస్లింలకు అభ్యంతరమనుకోవటం ఎంతటి ఆత్మద్రోహం? స్వాతంత్ర్య పోరాటం ఇతివృత్తంగా బ్రిటిషువారి నెదిరిస్తూ ఎన్నో సినిమాలు వచ్చినవి. మరి బ్రిటిషువారు క్రైస్తవులు, మనమంతా హిందువులమని ఆ సినిమాలకు మతం రంగు పూయలేదే? బ్రిటిషు వారినెదిరిస్తూ తీసిన సినిమాల వల్ల ఇక్కడి క్రైస్తవులకెవరికీ కోపం రాలేదే! మరి ఔరంగజేబు నెదిరిస్తూ పోరాడిన శివాజీ కథను సినిమాగా తీస్తే ఇక్కడి ముస్లింలకి కోపం ఎందుకు రావాలి? వారి కోపతాపాలను మనం ఎందుకు లెఖ్ఖ చేయాలి?

మన సినిమా వారి హిందూ మత సేవ ఈ విధంగా వుంటే పత్రికలు గూడా దానికేమీ తీసిపోకుండా వున్నవి. వినాయకచవితి ప్రత్యేక సంచికలే గాకుండా మామూలు రోజుల్లో గూడా మన దేవతలపై వ్యంగ్య చిత్రాలు, ఛలోక్తులు దర్శనమిస్తాయి. ఇదే విధంగా ఇతర మత విశ్వాసాలను అపహాస్యం చేస్తూ ఒక్క సినిమా కాదు గదా ఒక్క బొమ్మనైనా గీయగలరా? అటువంటి వ్యంగ్య చిత్రాలను, ఛలోక్తులను పంపితే ప్రచురించే ధైర్యం వీరికి వుందా? హిందువులు ఆవేశపరులు కాదు గనుక, హిందూ మతాన్ని ఎంత

అపహాస్యం చేసినా అడిగే నాథుడు లేడు గనుక మన సినిమాలు, పత్రికలు ఈ విధంగా ప్రవర్తిస్తున్నై. ఈ విధంగా చేయడం అసలే మతం పై శ్రద్ధలేని హిందువులను ఇంకా పాడు చేయడం కాదా? ఇది బాధ్యతాయుతమైన వ్యక్తులు, వ్యవస్థలు చేయవలసిన పనేనా? ఇస్లాం మతాన్ని అగౌరవ పరచాడన్న నెపంతో సాల్మన్ రష్దీ అనే రచయితకు విధించిన మరణశిక్ష సంగతి మనందరకు తెలిసినదే. హిందువులు గూడా ఇంత తీవ్రంగా స్పందిస్తే తప్ప హిందూ మతానికి రక్షణ లేదా? అయినా, మన సినిమాలు, పత్రికలు, సంఘసేవకులు కాదు. అవి కేవలం వ్యాపార సంస్థలు గనుక తమ లాభాల కోసం ఏమైనా చేస్తాయి అనుకుందాం. కాని మనకొక ప్రభుత్వం, దానికొక సెన్సారు విధానం వుంది కదా? అయాచితంగానే ఇతర మతస్థుల మనోభావాలను నొప్పించే సినిమాలను, పుస్తక ప్రచురణను నిషేధించే యీ ప్రభుత్వం హిందువుల విషయంలో ఎందుకు చేయదు? హిందువులంతా కలిసికట్టుగా ఉద్యమిస్తే తప్ప ప్రభుత్వం తనకు తానుగా అభ్యంతరకరమైన సినిమాలను, పుస్తక ప్రచురణలను నిషేధించలేదా? ఎందుకీ ద్వంద్వ వైఖరి?

# ఆత్మద్రోహులు

అసలు హిందూ మతానికి ద్రోహం చేసినవారు, చేస్తున్నవారు అన్యమతస్తులు కానే కాదు. స్వామి వివేకానంద చెప్పినట్లు "ముసల్మానులు ఎంత మంది సైనికులను దెచ్చుకొనిరి? సైన్యములో ఆంగ్లేయులెంత మంది యున్నారు? డబ్బుకాశపడి సోదరులను, తండ్రులను జంపగలవారు లెక్కకు మిక్కుటముగా నొక్క హిందూ దేశమున దప్ప మరెక్కడ లభింపగలరు?" హిందువులకు హిందువులే ప్రథమ శత్రువులు. హిందూ పురోభివృద్ధిని ఆటంకపరచేవారు హిందువులే. హిందూ సంస్కృతిని సంకరమొనరుస్తున్న వారు హిందువులే. హిందూ ఐక్యతను మత మౌఢ్యంగా చిత్రించేవారు హిందువులే. మతం మార్పులకు సిద్ధపడేవారందరూ గూడా హిందువులే. హిందూ దేవాలయాల్లో దొంగతనాలకు పాల్పడేవారు హిందువులే. దేవాలయ విగ్రహాలతో వ్యాపారం చేసేవారంతా హిందువులే. తమిళనాడులో ప్రతి ఏటా జరిగే రావణ లీలా కార్యక్రమంలో శ్రీరామచంద్రుని పట్ల అనుచితంగా ప్రవర్తించేవారంతా హిందువులే. రామాయణ విష వృక్షం వంటి రచయితలంతా హిందువులే. హిందూ పండుగల్లో, ఉత్సవాలలో, జాతరల్లో అల్లరి చేసేవారంతా హిందువులే. ఇట్లా ఎన్నో లక్షల ఉదాహరణలివ్వవచ్చు. హిందూ దేవతలను అపహాస్యం చేస్తూ తీసే సినీ నిర్మాతలు, హిందూ మతాన్ని అపహాస్యం చేస్తు గీసే కార్టూన్లు,

వేసే జోక్సు, వీటిని ప్రచురించే పత్రికాధిపతులు ఆదరించే పాఠకులు వీరందరూ హిందువులే. ఎనభై శాతం జనాభా కలిగిన హిందువుల దేశాన్ని హిందూ రాజ్యంగా ప్రకటించమంటే ముందు వ్యతిరేకించేది హిందువులు! ప్రభుత్వాలు ఎన్ని మారినా, రాజకీయ పార్టీలు ఎన్ని చీలినా, ఎన్ని కొత్తవి పుట్టుకొచ్చినా హిందూ వ్యతిరేక భావాల్లో మాత్రం అందరిదీ ఒకటే మాట. మత తత్వ శక్తుల పై పోరాటం... మత తత్వ శక్తులంటే కేవలం హిందూ మత శక్తులు తప్ప అన్యమత శక్తులు కాదు! హిందువులకి హిందువులే శత్రువులన్నది కఠోర సత్యం.

హిందువులు కేవలం హిందూ మతానికి, మత విశ్వాసాలకే గాదు, వ్యక్తిగతంగా కూడా హిందువులకి శత్రువులే. వినడానికిది చాలా ఆశ్చర్యం కలిగించినా దైనందిన జీవితంలో ఇది మనందరికీ అనుభవమే. ఒక సాంప్రదాయమైన హిందూ యువతి, కాస్తంత అందగత్తె రోడ్డు మీదకు ఒంటరిగా వస్తే మన యువకులు కోతులను మించి పోతారు. అసభ్య చేష్టలతో, అశ్లీల పదాలతో వారిని వేధిస్తుంటారు. ఇది మనకు అన్ని బహిరంగ ప్రదేశాల్లో, సినిమా హాళ్లల్లో, విద్యాలయాల్లో, ప్రభుత్వ కార్యాలయాల్లో, పార్కుల్లో, రైళ్లల్లో నిత్యం అనుభవమే. కాని యీ హిందూ వీరయువకులే మళ్లీ ఒక ముస్లిం స్త్రీ ఒంటరిగా వస్తే భయంతో సవినయంగా పక్కకి తొలగిపోతారు! ఈ రోమియోలంతా కేవలం యువక రక్తంతో, చిలిపితనంతో ఈవ్ టీజింగ్ చేస్తున్నారనుకుంటే హిందూ స్త్రీల పట్ల అసభ్య ప్రవర్తన, ముస్లిం స్త్రీల పట్ల భయభక్తులేమిటి? అంటే మతపరంగానే కాకుండా వ్యక్తిపరంగా కూడా హిందువే హిందువులకి శత్రువుగా ప్రవర్తిస్తున్నాడన్నమాట. లేకపోతే యీ ద్వంద్వ ప్రమాణాలకి అర్థం ఏమిటి? ఎంతటి అపశృతి ఇది? ఈ రకమైన వ్యక్తిగత శత్రుత్వం ఒక్క స్త్రీలకే పరిమితం కాక ఇది పురుషుల పట్ల గూడా విస్తరించి వుందంటే మరింత ఆశ్చర్యం కలగక మానదు. బహిరంగ ప్రదేశాల్లో ఒక సనాతన హిందువు గుండు, పిలక, నామం ధరించి పోతుంటే మన హిందూ వీరయువకులు ఒకటే ఇకయికలు పకపకలు. ఎందుకని? పోనీ వీరికి సనాతన హిందువు వేషధారణ నవ్వు పుట్టించేదిగా, ఛాందసమైనదిగా కనపడినందువల్ల అనుకుందాం. కానీ వీరే ఒక గడ్డం, లుంగీ ధరించిన ముస్లిం మోల్వీని గాని, తెల్లటి పొడుగాటి గౌను ధరించిన చర్చి ఫాదరీని గాని పల్లెత్తు మాటనరు. ఇంకా వినయంగా నమస్కరిస్తారేమో కూడా? మరి వీరి వేషధారణ కూడా సనాతన హిందూ వేషధారణలాగా ఎబ్బెట్టుగా లేదా? సనాతన హిందువులకు హేళన, సనాతన క్రైస్తవ ముస్లింలకు సమర్థన, హిందూ స్త్రీలకు వేధింపు. అన్యులకు ఆదరింపు. ఏమిటీ ధోరణి? ఆత్మ నింద, పరస్తుతి నేడు హిందువుల్ని పీడిస్తున్న మానసిక రుగ్మతలు.

అసలు హిందూ మతానికి రెండు పెద్ద అవరోధాలు హేతువాదం, నాస్తికవాదం మతంలోని మూఢాచారాలను నిరసిస్తూ మతాన్ని శుద్ధిపరచడమే హేతువాద లక్ష్యం. మానవత్వంపై విశ్వాసాన్ని పెంచడమే నాస్తికవాదం. అయితే యీ హేతువాదులు, నాస్తికవాదులంతా నిష్పక్షపాతంగా అన్ని మతాలలోని మూఢాచారాలను విమర్శించరు. వీరి వాదమంతా ఒక్క హిందూ మతానికి మాత్రమే పరిమితం. హిందూ మతంలో ఎన్నో మూఢాచారాలుండవచ్చు. కాని ఇవి ఏమతంలో లేవు గనుక? ముస్లిం స్త్రీల బురఖా సాంప్రదాయ మూఢాచారం కాదా? క్రైస్తవుల స్వస్థత కూటములు మూఢాచారం కాదా? కళ్లు లేని వారు చూస్తున్నారు నోరులేని వారు మాట్లాడుతున్నారు అని వీరు చేసే ప్రకటనలే గనుక నిజమైతే, ఇంక క్రైస్తవుల్లో ఎవరికీ అస్వస్థత వుండకూడదు గదా? మరింక వీరికిన్ని ఆస్పత్రులెందుకు? దేవాలయ ప్రవేశం వలదు అంటూ దేవాలయాల ముందు మాత్రమే ప్రదర్శనలు నిర్వహించేవారు మసీదులు, చర్చిలు ముందర చేయరు. క్రైస్తవుల సువార్త కూటముల వద్దకు పోయి మతం మత్తుమందు అని ప్రదర్శనలు ఇవ్వరు. ప్రభుత్వ ఖర్చుతో ప్రయాణించే మక్కా యాత్రికులకు దేవాలయ ప్రవేశం వలదని బోధించరు. నేడు సామాన్య జనానికి కూడా హిందూ మత ఆచారాలను విశ్వాసాలను విమర్శించడం ఒక ఫేషనుగా మారింది. 'హిందువుల యజ్ఞయాగాదులలో ఎంత నెయ్యి ఖర్చు అవుతుంది? ఎన్ని పాలు ఖర్చు అవుతాయి? దీపావళి పండుగకు ఎంత డబ్బు తగలేస్తారు టపాకాయలకు? ఇదంతా ఆ దేముడు సంతోషిస్తాడా? దీనికి బదులు ఆ డబ్బు బీదవారి కోసం వెచ్చించరాదా?' ఇదీ వరస....! సరే, హిందువుల యజ్ఞయాగాదుల్లో ఎంతో ఆహార పదార్థాలు ఖర్చు చేయబడతాయి. దీపావళి పండగ రోజు ఎంతో డబ్బు టపాకాలయకై ఖర్చు చేయబడుతోంది. కాని ముస్లిముల బక్రీదు పండుగ రోజు ఎన్ని వేల జంతువులు వధించబడతాయి? హేతువాదులు నోరు మెదపరేమి? హిందువుల పండుగలకు డబ్బు మాత్రమే ఖర్చు అవుతోంది. కాని ముస్లిమలు పండుగకి నోరులేని వేల జీవాలు బలికావడం లేదా? ఇదంతా ఆ దేముడు సంతోషిస్తాడా? హేతువాదులు మాట్లాడరేం? ముస్లిములు గాని, హిందువులు గాని ఎవరి ఆచారాలు వారివి. వాటిని గౌరవించడం అందరి ధర్మం. మూఢనమ్మకాలు సైతం ఒక్కోసారి సత్ఫలితాలిస్తాయని స్వామి వివేకానంద శెలవిచ్చారు. "…. సహన భావముతో కురూపియగు భార్యతో సంసార యాత్ర చేయుట, నిష్ప్రయోజకుడు క్రూరుడునగు పతి పై భక్తి కలిగి యుండుట యీ దేశముననే సాధ్యమైనవి. ఇవన్నియు సత్ఫలితములు." ఈ కుహనా హేతువాదులు,

నాస్తికవాదులు వీరంతా వికటించిన హిందువులు. వీరి వల్లనే హిందూ మతం అపఖ్యాతి పాలౌతోంది. నిజానికి హిందువుల్లో ఇంతటి నిర్లక్ష్యతా భావం, విచ్చలవిడితనం చోటు చేసుకోవటానికి ముఖ్యకారణం హిందూ మతం అత్యంత వ్యక్తి స్వేచ్ఛ కలిగిన మతం కావటమే. ఒక క్రైస్తవుడు వరుసగా రెండు వారాలు చర్చికి రాకపోయినట్లైతే మరునాడే అతనింటికి కబురు వస్తుంది దేముని సేవకు దూరమవుతున్నావని. కానీ హిందువులకీ దుస్థితి లేదు. వేదాలను ప్రామాణికంగా భావించేవారు హిందువులైతే చార్వాకుని వలె దైవమే లేదని నమ్మే కట్టు భౌతికవాదులు గూడా హిందువులే. ఆస్తికులు హిందువులే, నాస్తికులు గూడా హిందువులే. హిందువులు ఎన్నడూ దేవాలయ ధర్శనం చేయనప్పటికీ వారు జన్మతః హిందువులే! హిందూ మతం కేవలం ఒక్క మతమే కాదు అది ఒక జీవన విధానం గూడా. తన శరీరంలో హైందవ రక్తం ప్రవహిస్తున్నంతకాలం, తను హైందవ సంస్కృతిలో భాగమైనంత కాలం హిందువు హిందువే! మన పూజా విధానంలో పదహారు ఉపచారాలుపదేశించబడినై. ఆవాహనం, ఆసనం, పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం, స్నానం, వస్త్రం, యజ్ఞోపవీతం, గంధం, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం, తాంబూలం, నీరాజనం మరియు ఆత్మ ప్రదక్షిణం అనే షోడశోపచారాలతో మనం భగవంతుడిని అర్చిస్తాం. అయితే ఇందులో ఎవరికి ఎంతవరకు అనుకూలంగా వుంటుందో అంతవరకే ఆచరించే స్వేచ్ఛగూడా కల్పించబడటంతో హిందువులు క్రమంగా నాస్తికులైనారు. క్రమశిక్షణలోపించి హేతువాదులైనారు. హిందూ మత విశ్వాసం మానసికమైనట్టిది. భక్తి, కర్మ జ్ఞాన మార్గాలు మూడూ గూడా ముక్తికి సోపానాలే. ఎట్టి కర్మలను ఆచరించకుండా, ఎట్టి జ్ఞానము లేకుండానే భగవంతుని నిశ్చల మనస్సుతో ధ్యానించిన బోయవాని నోటి వెంట రామాయణ మహా కావ్యాన్ని పలికించగలిగినదీ మతంలోనే. కాని వ్యక్తి స్వేచ్ఛ, భావ స్వాతంత్ర్యం వికటించటం వల్ల హిందువులు తమ మతాన్ని తామే విమర్శించుకునే స్థితికి దిగజారారు.

# హిందువులు పిరికివారా?

ప్రపంచ దేశాలన్నిటిలోను ముస్లిలున్నారు. కొన్ని చోట్ల అధిక శాతంలో, మరికొన్ని చోట్ల అల్పసంఖ్యాకులుగా వున్నారు. మన దేశంలో ముస్లింలు అల్ప సంఖ్యాకులుగా వున్నప్పటికీ వీరు అధిక సంఖ్యాకులైన హిందువుల పై దౌర్జన్యం చేయగలుగుతున్నారు. ఎన్నికలు, రాజకీయాలు, ప్రభుత్వ పరిపాలనలో వీరు కీలక పాత్ర వహిస్తున్నారు. చైనా, సిలోన్, అమెరికా, యూరపు వంటి దేశాల్లో అధిక సంఖ్యాకులకు భయపడుతూ మనదేశంలోని అధిక సంఖ్యాకులను భయపెడుతున్న ముస్లిములంటే హిందువులకు

భయమా? హిందువులు జాతిపరంగా, స్వతహాగా పిరికివారా? ఇది ఎంతో సిగ్గుపడవలసిన ప్రశ్నే అయినప్పటికీ వాస్తవ సంఘటనలను బట్టి చూస్తే నిస్సందేహంగా హిందువులు ముస్లిముల ముందు పిరికివారే! ముస్లింలు మన దేశంలో పాకిస్తాను అనుకూల నినాదాలిచ్చినా, హిందూ మత దూషణ చేసినా, హిందూ ప్రార్థనా స్థలాల్ని అపవిత్రం చేసినా, చివరకు దేవాలయాల్ని పేల్చివేసినా హిందువులు పోలీసులకి ఫిర్యాదు చేస్తారే తప్ప ముస్లింలతో ఘర్షణకు దిగరు. ఈ కారణంగానే హిందువులు పాకిస్తాను నుంచీ తరిమివేయబడ్డారు. స్వదేశమైన కాశ్మీరు నుంచీ గూడా తరిమివేయబడ్డారు. హిందూ ప్రాబల్యం గల జమ్మూ నుంచి గూడా తరిమివేయబడుతున్నారు. జనాభాలో పది శాతం గలిగిన ముస్లింలు హిందువుల్ని నిర్వీర్యుల్ని గావిస్తూ తమ మత విశ్వాసాలకు అభ్యంతరకరమైన ఎటువంటి పుస్తక ప్రచురణనైనా నిషేధించగలరు, ఎటువంటి సినిమా ప్రదర్శననైనా నిలిపివేయగలరు. తమకి అంగీకారం కాని కుటుంబ నియంత్రణ, ప్రత్యేక న్యాయచట్టం వంటి వాటిపై ఎంతటి ప్రభుత్వశాసనాలైనా నిర్లక్ష్యం చేయగలరు. నేడు మన మధ్య లక్షల కొద్దీ పాకిస్తాన్, బంగ్లాదేశ్ తీవ్రవాదులు స్వేచ్ఛగా తిరుగుతున్నా గానీ వారిని బలవంతంగా వెనక్కి పంపించలేకపోతోంది ప్రభుత్వం. ఇంతటి పిరికితనం హిందువులకెలా వచ్చింది? హిందువులు జాతిపరంగా పిరికివారా? ఒక జాతి తన స్వదేశంలోనే అల్ప సంఖ్యాక వర్గాల వారికి భయపడుతూ బ్రతకడం ప్రపంచ చరిత్రలోనే వింతగా వుంది!

విశ్లేషించి చూస్తే పిరికితనం అనేది ధైర్యానికి వ్యతిరేక పదం. ధైర్యం అంటే పర్యవసానాలకి లెక్కచేయని తెగింపు, సాహసం, ఆవేశం అని చెప్పుకోవచ్చు. ఇది మంచికీ, చెడుకీ రెంటికీ వర్తిస్తుంది. యుద్ధ భూమిలో శత్రువుల శతఘ్ని కాల్పులను లెక్కచేయకుండా వీరోచితంగా ముందుకు దూసుకుపోయే వీరజవానులు, పర్యవసానాలకు లెక్కచేయకుండా హత్యలు, దోపిడీలు, మానభంగాలు చేసే వీధి రౌడీలు వీరందరూ ధైర్యస్తులే. ఒకటి మంచికీ రెండవది చెడుకీ వర్తించినా వీరిద్దరిలోను పిరికితనం వుంటే వారు చేసే పనుల్లో రాణించలేరు. అయితే ఒక మనిషి ఎప్పుడూ ధైర్యస్తుడుగానో, పిరికివాడుగానో వుండలేడు. మానవుల్లో యీ పిరికితనం, ధైర్యం అనేవి రెండూ అంతర్లీనంగా వుంటూనే, పరిస్థితులను బట్టి, స్వభావాలను బట్టి పైకి వస్తుంటాయి. ఉదాహరణకు దట్టమైన కారడవిలో చేతిలో చిన్న దీపమైనా లేకుండా విషకీటకాలకు క్రూరమృగాలకు ఏమాత్రం భయపడకుండా నడచిపోయే గిరిజనులు ఎంతో ధైర్యస్తులనిపిస్తారు. కానీ వీరే ఒక పెద్ద నగరానికి వచ్చి రోడ్డు దాటటానికి భయపడతారు. ఒకే వ్యక్తికి ఒక చోట ధైర్యం, మరొక చోట పిరికితనం!

అట్లాగే నగరవాసుల్లో బడిపిల్లలు సైతం మోటారు వాహనాలను లెక్కచేయక అవలీలగా రోడ్డు దాటగలరు. కాని వీరే ఒంటరిగా పల్లెటూళ్లల్లో చీకట్లో నడవటానికి భయపడతారు. ఒక చోట సాహసం, మరొక చోట పిరికితనం ఒకే వ్యక్తికి సంభవిస్తోంది. అట్లాగే హిందువులకి ముస్లింలతో ఘర్షణలంటే భయం కావచ్చు. కాని వీరిలో వీరు కలహించుకోటానికేమాత్రము భయం లేదు. రాజకీయ హత్యలు, రాయలసీమ ముఠాతగాదాలు, రంగాలు, భిల్లాలు, నక్సలైట్లు, పూలన్‌దేవిలు, వీరప్పన్లు వీరంతా హిందువులేగా? హిందువులు జాతిపరంగా పిరికివారైతే ఇదంతా ఎలా సాధ్యం? స్వాతంత్ర్య పోరాట సమయంలో బ్రిటిషువారి లాఠీ దెబ్బలకు, తుపాకి గుళ్లకి ఎదురొడ్డి నిలిచిన వారంతా పిరికివారేనా? ఇకపోతే ముస్లిములు మతపరంగా, జాతిపరంగా ధైర్యస్తులనుకుందాం. వారు మన దేశంలో అధిక సంఖ్యాకులైన హిందువులపై దౌర్జన్యం చేయగలుగుతున్నట్లు ఇతర దేశాల్లోని అధిక సంఖ్యాకులపై చేయలేకపోతున్నారే? పోస్టు కార్డు సైజు గూడా లేని ఇజ్రేలు దేశం పాలస్తీనాను ఆక్రమించుకుని వుంటే ప్రపంచ ముస్లిం దేశాలన్నీ ఏమీ చేయలేకపోతున్నాయే? బోస్నియాలోని ముస్లింలందరూ సెర్బుల చేతిలో చావు దెబ్బలు తిని పారిపోతున్నారే? సాల్మన్ రష్డీ రాసిన 'సాటానిక్ వర్సస్' అన్న పుస్తకాన్ని నిషేధించనందుకు బ్రిటిష్ ప్రభుత్వాన్ని అక్కడి ముస్లిములెవరూ ఏమీ చేయలేకపోయారే? ఏమైంది ముస్లిముల స్వాభావిక ధైర్యం? ఒక చోట ధైర్యం, మరొక చోట పిరికితనం ముస్లిములని గూడా ఆవరించింది.

భారతదేశంలో ముస్లిముల వీరోచితనానికి, హిందువుల పిరికితనానికి కారణం వారి స్వాభావికతకాదు. హిందువుల్లోని అనైక్యత, మతం పట్ల అలసత్వం, ప్రతీకారేచ్ఛ లేకపోవటం, పాపభీతి, సహజ గుణమైన శాంతి కాముకత్వం ఇవన్నీ ముస్లిములకు అవకాశమైనాయి. కాశ్మీరులో హిందువులందర్నీ భయభ్రాంతుల్ని చేస్తూ వాళ్లని తరిమివేసినా, దేశంలో ఎన్ని బాంబు ప్రేలుళ్లు జరిగినా, వాటికి తామే బాధ్యులని ముస్లిం తీవ్రవాద సంస్థలు ప్రకటించినా, వైష్ణవ దేవీ దర్శనానికి వెళ్లే యాత్రికులను అడ్డగించి చంపివేస్తామని బెదిరించినా, హిందువులెవరూ ప్రతీకారానికి పూనుకోరని ముస్లిములకి గత వేయి సంవత్సరాల అనుభవం చెపుతోంది. ఈ కారణంగానే వారు అధిక సంఖ్యాకులైన హిందువులపై దౌర్జన్యం చేయగలుగుతున్నారు. దీనికి తోడు కుహనా లౌకికులందరూ ముస్లిములకు వత్తాసు పలుకుతుండటంతో, అల్పసంఖ్యాకులైనప్పటికీ దేశంలో ముస్లింలదే పై చేయి అయింది. ఒకవేళ ముస్లిం తీవ్రవాదానికి జవాబుగా హిందువులెవరైనా ప్రతీకారానికి పూనుకోదలిస్తే దానిని నీరు గార్చేది మొదట మన లౌకిక హిందువులే! కేవలం కొద్ది మంది తీవ్రవాద, అతివాద ముస్లిముల చర్యకు మొత్తం ముస్లింలందరిపైనా

కక్ష తీర్చుకోవటం అనౌచిత్యమనీ, హిందూ ముస్లింలు శాంతియుతంగా జీవించాలని మత కల్లోలాల వల్ల దేశంలో అంతర్యుద్ధం చెలరేగగలదని యీ కుహనా లౌకికులు హిందువుల్ని శాంతింపజేస్తారు. నిజమే... కొద్దిమంది ముస్లిం తీవ్రవాదుల చర్యకు మొత్తం దేశంలోని ముస్లింలందర్నీ ద్వేషించటం అన్యాయమే. వారి పై కక్ష సాధించాలనుకోవటం కూడా అసమంజసమే. కానీ ఇదే నీతి ముస్లింలకు ఎందుకు వర్తించదు? ఉదాహరణకు అయోధ్యలోని బాబ్రి మసీదును కూల్చివేసినది షుమారు ఒక లక్ష మంది కర సేవకులనుకుందాం. దానికి ప్రతీకారంగా ముస్లింలు దేశంలోని అన్ని పట్టణాల్లోని హిందువుల పై దాడులు చేశారు ఎందుకు? మసీదు కూల్చివేతకు కారణమైన కరసేవకుల పై మాత్రమే వారి ప్రతీకారం చూపాల్సింది పోయి, అస్సాం నుంచీ ఆంధ్రప్రదేశ్ దాకా ఎందుకు దాడులు వ్యాపించినవి? ఈ కుహనా లౌకికులందరూ ముస్లింలకు బోధించలేకపోయారా? కత్తికి కత్తి అనేది ముస్లిం నినాదమైతే. శాంతి, సామరస్యం అనేది హిందువుల నినాదం! ఇంక హిందువులు ముస్లిముల ముందు పిరికివారు కాక మరేమిటి?

భారతదేశంలోని హిందువులు తమ పై దాడులు జరిగినప్పుడల్లా పోలీసులను నిందించడం మానివేసి తమను తాము రక్షించుకునే స్థితికి వస్తే తప్ప వారికి రక్షణ వుండదు. దేశంలోని ప్రతి పౌరుడికీ మూలమూలలా పోలీసు రక్షణ లభించడం అసాధ్యం. పాకిస్తాన్లోని హిందువులు అక్కడి ముస్లింలపై ఎందుకు దౌర్జన్యం చేయలేరు? ప్రతీకారం, ప్రతిఘటనా భయం, అదే నేడు ఇక్కడా కావలసింది. ముస్లిములకి కూడా హిందూ ప్రతిఘటనా భయం వుంటే తప్ప ఈ తీవ్రవాదం, మతవాదం అంతరించవు. ఆ భయం వచ్చిన నాడు అసలు కాశ్మీరు సమస్యే వుండదు! ఉదాహరణకు భారత్, పాకిస్తాను సరిహద్దులలో వున్న అడ్డంకుల్ని తొలగించి ఇరు దేశాల వారికీ స్వేచ్ఛను కల్పించారనుకోండి. పాకిస్తాన్లోని ప్రజలంతా భారత్‌లోకి ఆనందంగా, స్వేచ్ఛగా వస్తారు గాని మన దేశంలోంచి ఒక్కరు గూడా పాకిస్తాన్‌కి తరలిపోరు! హిందువులకింత అభద్రతా భావం ఎక్కడ్నుంచీ వచ్చింది? ప్రతిఘటన, ప్రతీకార భయమే హిందువుల పిరికితనానికి కారణం. అది హిందువుల్లో లేకపోవడమే ముస్లిముల ధైర్యానికి కారణం. గాంధీజీ సైతం ఎప్పుడు మత కలహాలు జరిగినా హిందువులను మందలించి ముస్లిములను బుజ్జగించేవారు. అది దేశ విభజనను విచారించడం కోసం చేశారని అనుకున్నా, దేశ విభజన తర్వాత గూడా మన నాయకులు అదే వైఖరిని అవలంబించడం వల్ల హిందువులు శాశ్వతంగా పిరికివారైనారు. గత వంద సంవత్సరాలుగా చేసిన చెఱుపు ఒక్క రోజులో పోయేది కాదు. ఈ భావదాస్యం నుండీ హిందువులు విముక్తులు కానంత వరకు ఈ పాపఫలం హిందువులు అనుభవించక

తప్పదు. హిందూ ఐక్యత లేనంతవరకు ఇది జరగదు. హింసకు తాత్కాలిక విజయమే తప్ప అహింసయే పరమ ధర్మమని హిందువుల విశ్వాసం. ధర్మం కోసం, రాజ్యవిస్తరణ కోసం హిందువులు ఎన్నడూ యుద్ధాలు చేయలేదు. అన్ని ధర్మాల్లోను మంచిని చూడగలిగిన హిందువులు ఎవరినీ ద్వేషించలేదు. బహుశః ఇంతటి గొప్ప మనస్తత్వమే హిందువులను పిరికివారుగా ముద్ర పడేటట్లు చేసింది. ఇదే అన్ని అపార్థాలకు కారణమైంది.

# హిందూ మతం పిరికితనాన్ని బోధిస్తుందా?

మన రామాయణ మహాభారత కావ్యాల్లోని ముఖ్య ఇతివృత్తం దుష్టశిక్షణ. దీని కోసం సాక్షాత్తు భగవంతుడే అవతారమెత్తి ఆయుధం చేపట్టి దుష్ట శిక్షణ గావించుతాడు. ధర్మాన్ని నిలబెట్టడం, ధర్మ యుద్ధం చేపట్టి ధర్మ రక్షణ గావించడం పవిత్ర కర్తవ్యమని హిందూ మతం బోధిస్తోంది. 'నిన్ను చంపడానికి వచ్చిన వాడు గురువైనా, పసివాడైనా, వృద్ధుడైనా, బ్రాహ్మణుడైనా నిర్విచారంగా చంపవలసిందేనని ఇందులో ఏ పాపము లేదని' మనుస్మృతి బోధిస్తోంది. అధర్మంగా మనలను చంపడానికి వచ్చిన వారినెదుర్కొనడంలో ఎట్టి మొగమాటము పనికిరాదని గాంధీజీ శెలవిచ్చాడు. దేశ విభజన సమయంలో జరిగిన మత కలహాలకు స్పందిస్తూ ఆయన "ఒక విధంగా నేను ముసల్మానుల ఆకతాయితనం కంటె గూడా హిందువుల పిరికితనానికే సిగ్గు పడుతున్నాను' అన్నాడు. విభజించి పాలించు అనే రాజనీతితో బ్రిటిషువారు బొంబాయి నుండి సింధు రాష్ట్రాన్ని విడదీయడంతో సింధు రాష్ట్రంలోని హిందువులు అల్పసంఖ్యాకులై ముస్లిముల చేతిలో దాడులకు గురైనారు. ఈ దాడులను ఆపి తిరిగి సింధు రాష్ట్రాన్ని బొంబాయిలో విలీనం చేయాలని గాంధీజీని కోరినపుడు ఆయన యీ విధంగా అన్నారు. "ప్రతి భారతీయుడు, హిందువు కాని ఇతరుడు కాని ముందు తనను తాను రక్షించుకోవడం నేర్చుకోవాలి. రాజ్యానికి ఒక విధి వున్న మాట నిజమే. కాని తనను తాను రక్షించుకోవడం అన్న కర్తవ్యంతో పంచుకోని వారిని ఏ రాజ్యము రక్షించజాలదు." గాంధీజీ అహింసావాదానికి వక్రభాష్యం చెప్పి గత వంద సంవత్సరాలుగా మన నాయకులు హిందువులను నిర్వీర్యులుగా తయారు చేశారు.

ఇకపోతే, హిందూ మతం అహింసను బోధించినా పిరికితనాన్ని ఎన్నడూ సమర్థించలేదు. ప్రపంచ మహామత గ్రంథాల్లో భగవద్గీతను మించినది లేదు. జీవాత్మ-పరమాత్మల సంవాదమైన యీ భగవద్గీతా కావ్యం శ్రీ కృష్ణ పరమాత్మ మానవాళికి

ప్రవచించిన అమృతవాణి. ఇందులో ఒక ముఖ్యమైన శ్లోకం చూడండి-

"క్లైబ్యంమాస్మగమః పార్థ, నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యంత్యక్త్వోత్తిష్ఠపరంతంప"

హృదయ దౌర్బల్యం విడచి ధీరుడవు కావలసిందని దీని అర్థం. క్లైబ్యం అంటే పిరికితనం. ఈ పిరికితనం విడిచి ధర్మం కోసం పోరాడవలసిందిగా భగవద్గీత ఉద్ఘోషిస్తోంది. కాని మన నాయకుల తప్పుడు విధానాల వల్ల మనలో క్షత్రియ లక్షణాలకు బదులు సాత్విక లక్షణాలు చోటు చేసుకున్నాయి. ఇటువంటి సాత్విక లక్షణాలను వేదాంతము ఆమోదించదని స్వామి వివేకానంద ఇలా శెలవిచ్చారు. "వేదాంతము పాపము నామోదించదు. దోషాన్ని అంగీకరిస్తుంది. నేను దురదృష్టవంతుణ్ణి. నాకు శక్తి లేదు. నేనేమీ చేయజాలను అని భావించటమే మహాదోషమని వేదాంతం ఉద్ఘోషిస్తున్నది."

ఒక మతానికి ఆధ్యాత్మిక సంపద ఎంత అవసరమో మతంలో సాహసం (Militancy) గూడా అంతే అవసరం. ఈ సాహసం వల్లనే సిక్కు మతం సంఖ్యలో అతిచిన్నదైనప్పటికీ ముస్లిం, క్రైస్తవుల దాడిని వీరోచితంగా ఎదుర్కొనగలిగింది. ఈనాడు సిక్కుల జోలికి పోవటానికి ఎవరూ సాహసించరు. హిందూ మతంలో ఆస్తికత, ఆధ్యాత్మికత పుష్కలంగా వున్నవి. లేనిది సాహసం మాత్రమే. హిందువుల్లో సాహసం లోపిస్తే ఒక్క మతాన్నే గాదు, తమను, తమ మతాన్ని, తమ స్త్రీలను, తమ సంపదను, తమ దేవాలయాల్ని చివరకు తమ దేశాన్ని గూడా రక్షించుకోలేరు. హిందువులకి ప్రస్తుత పరిస్థితుల్లో కావలసింది వేద విజ్ఞానం కాదు. రామాయణ మహాభారతాలు చదవకపోయినా ఫరవాలేదు. మంత్రపుష్పం, విష్ణు సహస్రనామం వల్లించకపోయినా ఫరవాలేదు. మీ దేముడొక రాయి, రప్ప అని హేళన చేసిన వారితో మీ దేముడొక లోహపు ముక్క అని జవాబివ్వలేని వారు ఎన్ని సహస్రనామాలు వల్లించి ఏం ప్రయోజనం? మిమ్మల్ని కాఫిర్‌లని చులకనగా సంబోధించినవారిని మీరు మ్లేచ్ఛులని తిరిగి అనలేకపోతే మీరు ఎంత భగవద్గీతా పారాయణం చేసి ఏం ప్రయోజనం? మిమ్మల్ని, మీ దేవతలను మీ మతాన్ని అవహేళన చేస్తూ హిందువులందర్నీ తమ మతంలో కలుపుకుంటున్న వారి పట్ల మీరు ఉదాసీనంగా వ్యవహరిస్తుంటే ఇంక మీరు వేదాలను ఔపోసన పట్టి మాత్రం ఏం లాభం? ప్రయోజనం లేని విద్య శూన్యం శూన్యం.

# ధర్మ రక్షణ

హిందూ మతస్తులారా... గత వేయి సంవత్సరాలుగా హిందూ మతం ఎంత నష్టపోయిందో తెలుసుకున్నాం. దానికి కారణాలు గూడా స్థూలంగా విశ్లేషించుకున్నాం. ఇంక హిందువులందరూ ధర్మరక్షణకు ఉద్యమించాలి. హిందూ మత రక్షణకై ధర్మ యుద్ధాన్ని ప్రకటించాలి. ఈ ధర్మయుద్ధం కేవలం అహింసాయుతమైనట్టిది. దీనికి ఆయుధాలతో పని లేదు. అసలీ యుద్ధం అన్య మతస్తుల మీద కానే కాదు. ఈయుద్ధం హిందూ అభివృద్ధి నిరోధకుల మీద, కుహనా లౌకిక హిందువుల మీద, మతం మార్చుకునే మానసిక బలహీనుల మీద, మతాన్ని కించపరచే స్వమతద్రోహుల మీద. ఈ ధర్మ రక్షణా కార్యక్రమంలో హిందువులు మైనారిటీ మతస్తులనెవ్వరినీ ద్వేషించనక్కరలేదు. వారి మతాలను నిరసించనక్కరలేదు. ముస్లింలకు మతం పట్ల గల ఆవేశం, సాహసం, మరియు క్రైస్తవ మిషనరీ సేవలను ఆదర్శంగా తీసుకుని హిందూ మత పునరుజ్జీవనానికి కృషి చేయాలి. నేటి నుంచీ ప్రతి హిందువు తన మతాన్ని తాను విమర్శించటం మానివేయాలి. నేటి నుండి ఒక్క హిందువు గూడా ఎట్టి పరిస్థితుల్లోను తన మతం విడిచి అన్యమత ప్రవేశం చేయరాదు. ఈ రెండు పనులను చేసిన నాడు ధర్మరక్షణా కార్యక్రమం చాలా వరకు నెరవేరినట్లే. హిందువుల ఐక్యత, మతం పట్ల గౌరవం, అన్య మతాల పట్ల విరక్తి భావం ధర్మ రక్షణకు ముఖ్యావసరాలు. అసలు హిందూ మతానికి గల ప్రమాదం అన్యమతస్తుల నుంచి కానే కాదు. అజ్ఞానంతో అన్యమత ప్రవేశం చేసిన మన హిందూ సోదరులను శుద్ధి కార్యక్రమం ద్వారా తిరిగి మన మతంలోకి తీసుకుని రావాలి. హిందువులంతా దేహదారుఢ్యంతో పాటు మానసిక దారుఢ్యం కూడా కలిగి వుండాలి. మానసికంగా బలవంతులైనపుడు మిమ్మల్ని ఎవరూ బలవంతంగా మతం మార్చలేరు. స్వామి వివేకానంద ఏమన్నారో చూడండి -

"... మన యువకులంతా బలశాలులై వుండాలి. ఇది ప్రధమావసరం. ఆ తర్వాత ధర్మాన్ని గురించి ఆలోచించవచ్చు. మరి కొంచెం దృఢమైన కండరాలు వుంటే గీతాశాస్త్రం మరింత చక్కగా గ్రహించగలవు. అద్భుత క్షాత్ర తేజం, ఆపాదమస్తకము తొణికిసలాడే ఒక మహావీరుడు, సత్యాన్వేషణకై తెగించి ప్రాణాలొడ్డ గల ధీరుడు, త్యాగమే ధనుస్సుగా, విజ్ఞానమే కరవాలంగా కలిగిన వీరుడు నేడు మనకు ఆదర్శమై నిలవాలి."

- స్వామి వివేకానంద

పశ్చిమ దేశాల్లో వచ్చిన పారిశ్రామిక విప్లవం మన దేశంలో రాకపోవచ్చు. హిందువులు రైలింజను, పొగ ఓడలను కనిపెట్టకపోవచ్చు. టెలిఫోన్లను, విమానాలను మరెన్నో సాంకేతిక పరికరాలను ఇతరుల నుండే గ్రహించి వుండవచ్చు. కాని మానవ జన్మకు సంబంధించిన ఎన్నో వేదాంత విషయాలను, ఆధ్యాత్మిక రహస్యాలను వెలికితీసినది హిందువులే. ఈ ప్రపంచంలోని రెండు పెద్ద మతములకు జన్మస్థానం మన దేశమేనంటే అది ఎంతటి గర్వకారణం? హిందూ మతం ఇక్కడ పుట్టి ఇక్కడ విస్తరించగా బౌద్ధమతం ఇక్కడ పుట్టి అన్యదేశాలకు విస్తరించింది. మానవ జాతి నాగరికతా చిహ్నాలు అధికంగా లభించినది మన దేశంలోనే. స్వామి వివేకానంద మాటల్లో చెప్పాలంటే -

"ఇక్కడనే, యీ ఒక్క దేశంలోనే మానవ హృదయం అతివిశాలమై, అనంత విస్తృతి నొంది తోడి మానవ జాతియే కాక పశుపక్ష్యాది సమస్త జీవకోటి, చేతనాచేతన సర్వ జగత్తు, పిపీలికాది బ్రహ్మ పర్యంతం, ఉచ్ఛనీచ భేదం లేకుండా అంతా తనలోనే వున్నట్లు భావన చేయగలిగింది. ఆత్మ స్వరూపమే తానన్న వివేకాన్ని గూడా మానవుడిక్కడే పొందాడు. ఐహిక భోగ పరాకాష్ఠనందుకుంటూనే జీవితంలో సుఖానికి రెట్టింపు దుఃఖం వుందని, మోహమే సర్వనర్థాలకి మూలమని మానవుడు మొట్టమొదటగా గ్రహించింది యీ గడ్డమీదనే. ఇదంతా మిథ్య అనీ మోహ శృంఖలాలను మొట్టమొదట తెంచివేయ గలిగింది యీ పవిత్ర భారతదేశంలోనే."

- స్వామి వివేకానంద

హిందువులారా! మన పురాణ కథల్లోని ఏవో కొన్ని అసందర్భ సంఘటనలను తీసుకుని హిందూ మతం పై బురద చల్లకండి. ఇటువంటి అసందర్భ విషయాలు అన్ని మతాల్లోను వున్నవి. గాంధీజీ చెప్పినట్లుగా తుకారాం, తిరువళ్లువరు, రామకృష్ణ పరమహంస, వివేకానంద వంటి ఎందరో అవలంబించిన మతం వట్టి గుణహీనమే కాగలదా? ఏమతం మంచి చెడ్డలైనా దానిలో జనించే మహనీయులని బట్టి నిర్ణయించాలే తప్ప దానిలో పుట్టే అధములని బట్టి కారాదు. హిందూ బంధువులారా! హిందూ మతంలో ఎన్ని లోపాలున్నప్పటికీ, మన పురాణ గాథల్లో ఎన్ని అపశృతులున్నప్పటికీ, మనలో ఎన్ని మూఢాచారాలున్నప్పటికీ, ఇదే, మన హిందూ మతమే అత్యుత్తమ మతమని చెప్పడానికి ఎట్టి సందేహము లేదు. ముస్లిములు క్రమం తప్పకుండా రోజుకు అయిదు సార్లు నమాజులు వల్లించవచ్చు, క్రైస్తవులు విధిగా వారానికొకసారి చర్చిలో ప్రార్థనలు జరపుకోవచ్చు. హిందువులు ఎన్నడూ భగవంతుని ధ్యానించకపోవచ్చు. అయినా యీ ముగ్గురిలో హిందువులే అత్యంత ఉన్నతమైన వ్యక్తులు అనటానికి ఎట్టి సందేహము

లేదు. ఒక మతములో ఎంతటి గొప్ప మత సిద్ధాంతములున్నవని కాదు ప్రశ్న. ఒక మతస్థులు ఎంతటి క్రమశిక్షణతో తమ మతాన్ని ఆచరిస్తున్నారన్నది కూడా కాదు ప్రశ్న. ఆ మత సిద్ధాంతములకు ఆ మతస్థులు ఎంతవరకు బద్ధులై నిలిచారన్నదే ముఖ్యం. ఉదాహరణకు ఇస్లాం అంటే శాంతి అని అర్థం. ముస్లిముల్లో శాంతి, సామరస్య భావాలు ఎంత వరకు ఉన్నాయన్నది అందరకూ తెలుసు. అత్యంత భయంకర నేరప్రవృత్తి గల ముస్లిములు సైతం రోజుకి అయిదు సార్లు నమాజులు వల్లించి ఏం ప్రయోజనం? పొరుగు వారిని నీ స్వంత వారిలాగా ప్రేమించు అనే ముఖ్య క్రైస్తవ సూత్రాన్ని విస్మరిస్తూ, హిందూ మతాన్ని అపహాస్యం చేస్తూ హిందువుల మతం మార్పులకై కృషి చేసే మిషనరీల కంటే, సాత్వికులుగా, అహింసావాదులుగా, శాంతి కాముకులుగా జీవించే హిందువులే ఎంతో ఉత్తమ జన్ములు. అంతటి అస్తవ్యస్త హిందూ మతం నుంచే ఇంతటి పాపభీతి, శాంతి ప్రియత్వం, పరమత సహనం గలిగిన హిందువులు జన్మించటం కంటే మతానికి సార్థకత ఇంకేం కావాలి? హిందూ మతంలో ఎన్నో లోపాలుండవచ్చు. హిందువులందరికీ తమ మతం గురించి ఏమీ తెలీకపోవచ్చు. కాని హిందువుల ఆధ్యాత్మిక జీవన విధానం, వారి ప్రత్యేక సంస్కృతి, ప్రాచీన వైభవం, ఇవి చాలు హిందువుల ఆత్మోన్నత్యానికి.

సోదర హిందువులారా! హిందూ మత పునరుజ్జీవనానికి అత్యంత ఆవశ్యకమైనది ఆత్మవిశ్వాసం. మీరు బ్రాహ్మణులు కావచ్చు, కమ్మ వారు కావచ్చు, రెడ్డి కులస్తులు కావచ్చు. కాపు, హరిజన లేక మరే ఇతర కులస్తులైనా కావచ్చు. కాని ముందు మీరంతా హిందువులు. ఆ తర్వాతే ఫలానా కులస్తులు. ఈ దేశంలోని పౌరులంతా ముందు భారతీయులు. ఆ తర్వాతే ఆంధ్రులు, తమిళులు, బెంగాలీలు, పంజాబీలు. అదే విధంగా ముందు మనందరం హిందువులం. ఈ భావన మనలో మన సావాచాకర్మణా వున్నట్లైతే ఇంక ధర్మాన్ని రక్షించినట్లే. ఈ భావం, నేను హిందువును అన్న భావం లేనపుడు మీరు రోజుకెన్ని సార్లు దేవాలయ దర్శనం చేసినా ప్రయోజనం శూన్యం. హిందువులకు తమ మతంపైన సందేహాలున్నంత కాలం, వారికి తమ మతం పై అలసత్వం వున్నంత కాలం వారు అందరికీ లోకువే. హిందూ మతస్తులారా! ఒక్క విషయం మరచిపోకండి. ఒక మతం యొక్క మంచి చెడ్డలు, ఎక్కువ తక్కువలను తూచే పడికట్టురాళ్లు ఎవరి దగ్గరా లేవు. ఏ మతం యొక్క ఔన్నత్యానికైనా నిదర్శనం ఆయా మతస్తుల ప్రవర్తన మరియు వారి సంస్కృతిలే తప్ప మరేదీ కాదు. నిబంధనలు, పుస్తకాలు, ప్రసంగాలు ఇవన్నీ పైపై అలంకారాలు. ఎనిమిది వేల సంవత్సరాల చరిత్ర కలిగిన హిందూ ధర్మం, హిందూ సంస్కృతికి ఇప్పుడు కొత్తగా ఎవరూ సర్టిఫికేటు ఇవ్వనవసరం లేదు. ప్రపంచ నాగరికతలన్నింటికీ ప్రాచీనమైన మన నాగరికతకు మూలస్తంభమైన హిందూ మతం మంచి చెడ్డలు తూచడం ఎవరి తరమూ కాదు. ప్రాచీన ప్రపంచ భాషలైన గ్రీకు, లాటిన్ నేడు మన మచ్చుకు గూడా వాడుకలో లేకపోగా వాటి కంటె ప్రాచీనమైన మన సంస్కృత భాష నేటికీ సజీవంగా నిలిచి వుంది. మన నాగరికతంతా ఇంగ్లీషు వారి రాకతోనే పుట్టింది

కాదు. మన భాషా శాస్త్రము, వ్యాకరణ శాస్త్రము ఎన్నో శతాబ్దాల క్రిందే వికసించి అద్భుతమైన కావ్య రచనలు చేయడం గూడా జరిగింది వ్యాసుడు, వాల్మీకి, భాసుడు, అగ్నిమిత్రుడు, మైత్రేయుడు, శూద్రకుడు, కాళిదాసు, భారవి మొదలగు మహాకవులు మనకు ఎనలేని సాహిత్య సంపదను ఏనాడో అందించిపోయారు అంతే గాదు నేటి ఆధునిక విజ్ఞాన విషయములనెన్నిటినో మన ఋషులు ముందే గ్రహించి శాస్త్రాలలో నిక్షిప్తం చేశారు. ఉదాహరణకు సూర్యభగవానునికి ఏడు గుర్రములెందుకు వున్నవి? అవి ఆరు గాని ఎనిమిది గాని ఎందుకు కావు? ఎందుకంటే, సూర్యకాంతిలో ఏడు వర్ణములున్నవి గనుక సూర్యుడు సప్తాశ్వరథసారథిగా పేర్కొనబడ్డాడు. ఈ విషయం మనకి తెల్లవారు రాకముందెన్నడో తెలిసిన విషయం! అంతే కాదు గ్రహరాసుల చలనమును అధ్యయనం చేసి పంచాంగములు తయారు చేయటం, సంవత్సర కాలానికి ముందే నిముషాలు, సెకండ్లతో సహా చంద్రగ్రహణం, సూర్యగ్రహణం, తిథులు వగైరాలను సూచించడం విజ్ఞాన విషయం కాదా? ఇంతటి శాస్త్ర సమ్మతమైన మతాన్ని ఎవరో అవహేళన చేస్తే మనం వాటిని లెక్క చేయటమా?

హిందూ సోదరులారా! మీరు ఆత్మ విశ్వాసం కలిగిన హిందువులని, మీరు త్రికరణశుద్ధిగా హిందువులేనని, మీరు హిందువులు గానే జన్మిస్తారని, జీవిస్తారని చివరకు హిందువులుగానే మరణిస్తారని ప్రకటించిననాడు ఇంక ఈ దేశంలోని మిషనరీలకు నూకలు చెల్లినట్లే! ఎందుకంటే యీ భావాన్ని బట్టే క్రైస్తవ మిషనరీలు ముస్లిముల వద్దకు, సిక్కుల వద్దకు పోయి మతప్రచారం చేయరు, వారెంత చెప్పినా అదంతా అరణ్యరోదనమే అవుతుంది కనుక. ఇంక హిందువులు గూడా ఆత్మవిశ్వాసం కలిగియున్న నాడు మతం మార్పులు అద్భుతంగా నిరోధించబడతాయి. అత్యంత అహింసాయుత పద్ధతిలో యీ ధర్మరక్షణా కార్యక్రమాన్ని హిందువులు నిర్వర్తించగలుగువారు. హిందూమతం ఆచంద్రతారార్కం వర్ధిల్లుతుంది. ధర్మోరక్షతి రక్షితః ఇక హిందువులు కూడా తమ ప్రచార కార్యక్రమాన్ని ప్రారంభించాలి. అన్య మత ప్రచారాలకి ప్రతిగా తమ సమర శంఖారావాన్ని వినిపించాలి. ఎక్కడ గోడల మీద గాని, కరెంటు స్తంభాలు, టెలిఫోను స్తంభాల పై గాని అన్యమత సందేశాలు రాసి వుంటే వాటి ప్రక్కనే హైందవ మత సందేశాలు గూడా రాయించాలి. ఇది అహింసాయుతమైన పోటీ యుద్ధం. ప్రకటన, ప్రచార హక్కులు ఏ ఒక్కరి స్వంతమూ కాదు. హిందువులను ఆకర్షించటానికి అన్యమతస్తులు ప్రయత్నిస్తుంటే హిందువులను రక్షించటానికి స్వరక్షా ప్రయత్నం చేయటం తప్పా? వారిది భక్షణ, మనది రక్షణ! అంతే. మనలో ఎన్నో దీక్షా సంఘాలున్నవి. ధర్మ ప్రచార కార్యక్రమంలో వీళ్లంతా పాలు పంచుకోవాలి. అయ్యప్ప దీక్ష, భవానీ దీక్ష వగైరా దీక్షా కాలంలో వారంతా క్రైస్తవ సందేశాలకు ప్రతిగా హైందవ సందేశాలు రాయాలి. హరిజనవాడలు, గ్రామగ్రామాలు దర్శించి వారికి హిందూ మతావశ్యకతను బోధించి అన్యమత ప్రచారానికి ప్రతి ప్రచారం చేయాలి. మన దేశంలో తిరుపతి, కాశీ, ప్రయాగ,

రామేశ్వరం, బదరీ వంటి ముఖ్య యాత్రా స్థలాల్లోని దేవాలయ ప్రాంగణాల్లో హిందూ మత అనుకూల సందేశాలు వ్రాయించి హిందువులను వివేకవంతులను చేయాలి.

నేడు మనం ఇరవై ఒకటవ శతాబ్దంలో, అంతరిక్ష యుగంలో వున్నాము. ఈ యుగంలో కూడా ఇంకా మత పిచ్చి ఏమిటి? హిందుత్వం హిందూ మతం అంటూ మనం వెనక్కి నడుస్తున్నామా? మరి మత ఛాందస దేశాలైన సౌదీ అరేబియా, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్ వంటి దేశాలకు మనకు గల తేడా ఏమిటి? మనలో ఆధునిక భావాలు, శాస్త్రీయ దృక్పథం, హేతువాదానికి బదులు మత ఛాందసం, మత మౌఢ్యం వంటివి చోటు చేసుకుంటున్నవా? మతం మత్తులో పడుతున్నామా? లేదు. హిందువులు గత వంద సంవత్సరాలుగా తమ మతానికెటువంటి ప్రాధాన్యతనివ్వక, భౌతికవాదులుగా, లౌకికవాదులుగానున్నందుకు లభించిన ఫలితం ఏమిటి? నాటి దేశ విభజన, నేటి ఉగ్రవాదం! నాడు పాకిస్తాను, నేడు కాశ్మీరు. ఏ దేశంలోనైనా శాంతిభద్రతలు, దేశరక్షణ కరువై దేశం సాంకేతికంగా ఆర్థికంగా అభివృద్ధి చెందగలదా? ఒకవేళ చెందినా అటువంటి అభివృద్ధి అంతరంగిక సుస్థిరత లేకుండా నిలిచేనా? జాతి విద్రోహశక్తులు తీవ్రవాదులు దేశంలో మోహరించి వుండగా సాధించిన అభివృద్ధి కాస్తా విధ్వంసానికి గురి కావటం లేదా? హిందువుల సామూహిక మతం మార్పులతో హైందవ సంస్కృతి, నాగరికత అంతరించిపోవటం లేదా? అభివృద్ధిని సాధించుకుంటే దానిని నిలుపుకోవటం కూడ అంతే అవసరం. ఎంతటి అభివృద్ధి చెందిన దేశాల్లో సైతం మతం అంటరాని వస్తువు కాలేదు. నేడు అమెరికా, యూరోపియన్ దేశాలు అత్యంత సాంకేతికంగా, ఆర్థికంగా అభివృద్ధి చెందాయి. అయినా యీ దేశాలన్నీ క్రైస్తవ మత ప్రచారాన్ని ఎందుకు కొనసాగిస్తున్నాయి? ఆధునికత చోటు చేసుకున్న చోట మతం నిషేధించబడిందా? లేదే? హిందూ దేశం, హిందువులు గూడా శాస్త్ర సాంకేతిక రంగాలలో ఎంత అభివృద్ధిని సాధించదలచినా, హిందూ మతాన్ని నిర్లక్ష్యం చేయనక్కరలేదు. ఎంతటి ఆధునిక యుగంలో వున్నా, శాస్త్ర విజ్ఞానం ఎంత వికసించినా, మతానికి, ఆధునిక సాంకేతిక అభివృద్ధికి ఎటువంటి పోటీ లేదు. ఉదాహరణకు పశ్చిమాసియాలోని జెరూసలెం నగరం యూదులకు, ముస్లిములకూ క్రైస్తవులకు ముగ్గురికీ పవిత్రమైనది. మూడు వేల సంవత్సరాల క్రితం యూదుల సార్వభౌముని శిధిలదేవాలయమే నేడొక శోక కుడ్యంగా (Wailing wall) యూదులందరికీ పవిత్ర క్షేత్రమైంది. ఈనాటికీ ప్రపంచ నలుమూలల నుంచీ యూదులు లక్షల సంఖ్యలో యీ శోక కుడ్యం వద్ద నిలుచుని తమ పవిత్ర నగరమైన జెరూసలెం పతనమైనందుకు విలపిస్తుంటారు. ఎంతటి ఉదాత్తమైన విశ్వాసమో చూడండి! మూడు వేల సంవత్సరాల నాటి శిథిల నగరం కోసం నేటికీ విలపిస్తున్న యూదులు. అయిదు వేల సంవత్సరాల నాగరికతను రోజు రోజుకీ శిథిలం చేసుకుంటున్న హిందువులు!

హిందూ బంధువులారా! హిందూ మతంలో భక్తి, కర్మ జ్ఞాన మార్గాలు మూడూ కూడా ముక్తిపద మార్గాలుగా పేర్కొనబడినప్పటికీ, హిందువులు జ్ఞాన మార్గ సాధనలో కృషి చేయాలి. మన వేదాలు, ఉపనిషత్తులు, వేదాంతము వంటి విషయాలపై అమూల్యమైన గ్రంథాలెన్నో వున్నవి. హిందువులు తమ మతాన్ని గురించిన విజ్ఞాన విషయాలను తెలుసుకోవాలి. తిరుమల వంటి పుణ్యక్షేత్రాలకు వెళ్లినపుడు అక్కడ కేవలం దైవ దర్శనంతోనే తృప్తి పడక దేవస్థానం వారు ప్రచురించే అనేక మతగ్రంథాలను, ధార్మిక రచనలను పరిశీలించాలి. అటువంటి పుస్తక ప్రదర్శనశాలనను తప్పనిసరిగా దర్శించాలి. భక్తి మార్గంతో బాటు జ్ఞానమార్గం కూడా అవసరమని భావించాలి. ఇటువంటి జ్ఞానం హిందువులకు కలిగినపుడు ఇతర మతములేవీ హిందువులను ఆకర్షించలేవు. ఎవరి అభూతకల్పనలకూ హిందువులు మోసపోరు.

హిందూ బంధువులారా! పుట్టిన వాటికి మాత్రమే గిట్టటం వుంటుంది. హిందూ మతం అపౌరుషేయమైనట్టిది. ఇది ఎవరి వల్లా పుట్టినది కాదు. దీనికి మూల పురుషుడు గాని, మత ప్రవక్త గాని ఎవరూ లేరు. ఈ మతం అన్యులెవరివల్లా నాశనం కాదు. ముస్లిం ఛాందసవాదులు, క్రైస్తవ మిషనరీలు తమ అధికార బలంతో కూడా ఈ మతాన్ని నాశనం చేయలేకపోయారు. ఇక ముందు గూడా ఈ మతానికి ఇతరులవల్ల ఎట్టి భయము లేదు. హిందువుల్లో ఏకాత్మత కరువై, హిందువుల్లో అంతఃకలహాలు ఎక్కువై, హిందువుల్లో స్వమతద్రోహులు ఎక్కువై, హిందువులందరూ భ్రష్టులైనప్పుడు మాత్రమే హిందూ మతానికి హాని జరుగుతుంది. హిందూ మత భవితవ్యం కేవలం ఒక్క హిందువుల చేతుల్లోనే వుంది.

ప్రాచ్య ఖండంలో విరిసిన ఒక మహోన్నత నాగరికతా సుమం హిందూ మతం. అయిదు వేల సంవత్సరాల నాగరికత కలిగి, ప్రపంచ మహానాగరికతలెన్నో కాల గర్భంలో కలిసిపోయినా నేటికీ సజీవంగా, సహజ రీతిలో నిలిచి వున్నదీ హిందూ మతం. ఈ హిందూ శబ్దం హిందువుల ఆత్మ గౌరవానికి, ఆధ్యాత్మిక ఔన్నత్యానికి గొప్ప సంకేతమే అవుతుందో లేక ఎందుకూ పనికి రాని, సిగ్గు పడవలసిన అధమాధమత్వాన్నే సూచిస్తుందో ఇది కేవలం హిందువుల ప్రవర్తన పైనే ఆధారపడి వుంది. ధర్మో రక్షతి రక్షితః

వేద శాఖలు పెరిగెనిచ్చట
ఆదికావ్యం బందుకొనెనిట
బాదరాయణ పరమ ఋషులకు
పాదుసుమ్మిది తమ్ముడా

ఉత్తిష్ఠ, జాగ్రద, ప్రాప్యవరాన్ని బోధిత
లెండి, మేల్కొనండి, కార్యము సాధించువరకు విడనాడకండి.

